# ఇదేనా విముక్తి

(నాటిక)



★

రచన

చదలవాడ పిచ్చయ్య

★

నవ్యసాహిత్య ప్రచురణ, విజయవాడ.

1956

## ఇందులోని పాత్రలు

మంగమ్మ

చుక్కమ్మ

రాగమ్మ

కృష్ణమ్మ

సుబ్బయ్య

కాయజరావు

సోమయ్య

కొండలరావు

మరికొందరు



శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారు

# అంజలి

భారత జాతీయ జీవనధర్మమే మానవునికి అత్యుత్తమ మైనదని పరిపూర్ణంగా విశ్వసించి, అఖిలాంధ్ర సాహిత్య కళాక్షేత్రంలో అసమానులైన ప్రతిభాసంపన్నులని అఖండ మైన ఆదరాభిమానములను సంపాదించుకొని లలితకళా కోవిదులై కళాలక్ష్మికి తియ్యని తెనుగుదనాన్ని తేటతెలుగులో పరిపాదించి నేర్పులో తీర్పుతీరువలు తీర్చిదిద్దిన నవ్యకావ్య కృతికర్తలైన కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికి 'ఇదేనావిముక్తి' అను యీ నా కావ్యకన్యను భక్తి ప్రపత్తులతో గౌరవాదరాలతో సవినయంగా అంజలి ఘటించి సమర్పిస్తున్నాను ఆదరంతో అందుకొని ఆత్మీయం చేసుకుంటారని ఆశిస్తున్నాను

# ఒక మాట

నవ్య జీవిత విధానాన్ని గురించి చర్చిస్తున్నారు నవ్య సాహిత్య పథాన్ని గురించి పరామర్శిస్తున్నారు వాదోపవాదాలు చేస్తున్నారు ఏది జీవితానికి రమణీయమో ఏది జీవితానికి పరమార్థమో, ఏది జీవితానికి ఆనందప్రదమో తేల్చి నిర్ణయించలేకపోతున్నారు ఇది యుగసంధికి కాలం కావడంవల్ల నా అన్న ప్రశ్నార్థకం మిగులుతుంది ఎవరికి తోచిన రీతిని వారు భావించుకొని సంతృప్తి పడవచ్చు

పాతకొత్తల మేలి కలయికలో జీవితవిధానం పరవళ్ళు త్రొక్కుతూ నడుస్తుంది ఒకొక్కప్పుడు అతివేగంగా మరొకప్పుడు ఒడిదుడుకులతో, వేరొకప్పుడు నిదానంగా, ఇంకొకపుడు స్తబ్ధంగా నడకను సాగిస్తుంది ఇది యిలా ఎందుకు జరుగుతుందో ఊహించడం సాధ్యం కాకపోతుంది ఇదే ప్రకృతిలోని వైచిత్ర్యమేమో!

సంఘం మారుతుంది జీవితం మారుతుంది పరిస్థితులు మారుతున్నాయి అన్నీ ప్రకృతి సిద్ధంగా మారుతున్నా ప్రతివ్యక్తీ తానే కర్తనని తనతనాన్ని తాను సమర్థించుకో చూస్తున్నాడు ఇదీ ప్రకృతి సహజమేనేమో!

ప్రకృతి యిది అని నిర్ధారణ చేయడం మానవునికి సాధ్యం కాదనిపిస్తుంది కాని మానవుడు తనవ్యవహార కోసం కొన్నికొన్ని పద్ధతులు యేర్పరచుకొంటున్నాడు ఈ పద్ధతులు మార్చుకొంటున్నాడు ఈ మార్పులు వ్యవహారమాత్రమేనని మరచిపోతున్నాడు ఈ మరపే మానవుని జీవిత విధానానికి చిక్కును కల్పిస్తుంది

ఈ చిక్కు విడటం విడకపోవడం ప్రతి వ్యక్తి విజ్ఞతపై ఆధారపడి ఉంది వ్యక్తి విజ్ఞత ఆతని జననిర్మితమై ఉంది జననం ప్రకృతి లక్షణం ప్రకృతి జనన కారణం ఇది అవినాభావ సంబంధ కలిగి ఉంది అంటే విత్తునుంచి చెట్టు వచ్చిందా? చెట్టునుంచి విత్తు వచ్చిందా? ఇవి రెండూ నిశ్చితరూపాలే ఇవి రెండూ వాస్తవాలే ఇవిరెండూ సహజాలే చెట్టులోనుంచి విత్తూ, విత్తులోనుంచి చెట్టూ అంతర్భాగంగా ఉండి పరిణామము చెంది కాలక్రమాన నిశ్చితరూపంలో కనుపిస్తాయి ఒక కాలంలో

కనుపించనిరూపం మరొక కాలంలో ప్రత్యక్ష ప్రమాణమై కూర్చుంటుంది అందుకే అర్థవివరణ అర్థం వివరించితే గాని విషయం బోధపడదని ప్రాచీనకాలంనుంచీ పెద్దలు విన్నవిస్తూ వచ్చారు అయితే మనం నవీనులం ?క పద్ధతి మారి మరో పద్ధతి కావాలనడమే నవీనమని నమ్మే వాళ్ళం అంతేకాదు ఒకవిధానంవల్ల సమాజానికి అనర్థకం సంప్రాప్తమవుతు దని వివరించి దానినే మరోవిధానంలో ప్రవేశపెట్టి సాంఘిక సౌఖ్యాన్ని సంపాదించి పెట్టిన సంస్కరణవాదులంగా చెలామణి అవుతున్న నవీనులం ఈ నవీనత అంటే ఏమిటో వివరించి చెప్పడమూ కష్టమే ఈ నవీనతలోని రామణీయకత అంటే ఏమిటో స్పష్టీకరించడమూ అసాధ్యమే అయినా నవీనత నవీనతే

సోషలిష్టు విధానం కావాలి సోషలిష్టు విధానమే యీనాడు అన్ని సమస్యలకూ పరిష్కారమార్గం ఈ సోషలిష్టు విధానం భిన్న భిన్న విధాల వివరించబడుతుంది ఒకరి విధానం మరొకరికి గిట్టుబాటు కావడంలా అయితే యీ విధానాలన్నింటి పర్యవసానం ఏమిటో దురూహ్య

ఇది ఒకవిధమైన విచిత్రవాదం ఎందుకు యిది విచిత్రవాదమో వివరిస్తాను

కాలం మారింది లోకం మారింది ఈ కాలమూ, లోకమూ ఆవిరియత్ర కారణంగా మారాయి ఈ ఆవిరియత్ర మానవుని మేధాశక్తి కారణంగా ఆవిర్భవించింది ఇది ప్రకృతి వైచిత్ర్యం కాలమూ, లోకమూ మానవుని మేధాశక్తి పరస్పరాశ్రయాలు ఇవి ఒకదానినొకటి ఆశ్రయించే ఉన్నాయి ఇదే సృష్టివైచిత్ర్య ఈ సృష్టి ఎలా ఏర్పడుతుందీ ఎలా ఏర్పడిందీ ఎవ్వరూ నిర్ణయించలేరు ఏ నిర్ణయమూ చేయలేని విషయాలపై నిర్ణయం చేయడమే హాస్యాస్పదమని అనిపిస్తు ది

మార్క్సు ఏమి వ్రాసాడో అర్థంచేసుకోని కొందరు కొన్ని ప్రయత్నాలు చేసారు ఈ చేసిన ప్రయత్నాలలో కొన్ని కొత్త అవతారాలు ఏర్పడ్డాయి ఈ ఏర్పడిన రూపాలకు ఆయన కల్పిత భావాలే ప్రామాణ్యాలని భాష్యాలు చెప్పుకుటూ బ్రతికే లోకం కనుపిస్తుంది ఇలా ఎందరెందరి భావాలనో కొందరు కొందరు కొన్ని కొన్ని విధాల అర్థం

చేసుకొనినవారు కొన్ని ఆవతారాలను ఏర్పరచుకొన్నారు అవన్నీ కాల కల్పితమైన మూఢనమ్మకాలనీ మూర్ఖత్వ లక్షణాలనీ అనడం తెలిసే ఉంది ఒకరి నమ్మకాలు మరొకరికి మూఢంగాను మూర్ఖంగాను కనుపిస్తాయి తమ తమ నమ్మకాలే, తమ తమ అనుభవాలే అందరికీ ఆచరణయోగ్యమనే నమ్మకం కలగడానికి ప్రచారం చేయిస్తాయి

మార్క్సు చెప్పిన పద్ధతిలో లోకం నడవాలనేవారు కొందరున్నారు కాదు కాదు బూర్జువా ప్రజాస్వామ్య మార్గంలో పయనించాలనేవారున్నారు లేదు లేదు గాంధేయపథంలో ప్రయాణం సాగించాలనేవారున్నారు ఇంకా కొందరు మరికొన్ని పద్ధతులు సూచిస్తున్నవారున్నారు ఇవేకాదు దైవమార్గమనీ, మత, ధర్మ పరిధిగల మార్గములను నిరుపు పెట్టేవారున్నారు ఈ భిన్న భిన్న వాదాలను చేసేవారు తాము నమ్మిన దానిని ఆచరణలో పెట్టడానికి జంకుతున్నారు తమమతము జ్ఞాతాచారాలకే రుచిచని దానిని అందరూ అనుసరించాలని కోరడంలో ఏమున్నదో ఆలోచించుకోవాలి ఈనాటి లోకపరిస్థితి యిలాగా తోస్తుంది ఈ సమస్యా పరిష్కారంలో మానవ ప్రయాణాలెలా సఫలీకృతమవుతున్నాయో అర్థం చేసుకోవడానికి, ధార్మికజీవనమిదేనా అనే ప్రశ్నల ఆలోచన కలగడానికి యీనాటి కారచన తోడ్పడుతుందనే ఉద్దేశ్యంతో కళారూపం కల్పించాను ఇది ఎంతవరకు మానవుని ప్రయాణాన్ని వెల్లడిస్తుందో పాఠకులే గ్రహిస్తారని ఆశిస్తున్నాను ఇది యేమాత్రం ప్రయోజనాన్ని సమకూర్చిపెట్టినా నా కృషి ఫలితం అంతవరకే పరిమితమైన దీనిని గ్రహించి మన్నించమని కోరుతున్నాను

ఈ రచనాపద్ధతి నవీనము ఈ కథావిధానము నవీనము ఇందులోని జీవితపథమే నవీనము ఇది అంటా అన్నింటా నవీనము కావ్యమైన నవీనము కావ్యకళా చమత్కృతి నవీనము అంతా నవీనము ఈ జగత్తంతా నవీనము ఇది నవీనము ఈ నవీననామ వచనమే నవీనము ఇది ఒక అనిర్వచనీయమైన నవీనము

# ప్రవేశిక

ఆంధ్రజాతి జీవితంతో తన జీవితాన్ని పెనచుకొని, ఆంధ్రసాహితీ మహోద్యానంలో తన కవితాలతికలు పెనుచుకొని, ప్రతిభా వ్యుత్పన్నతల ప్రాభవంతో ఈనాడు శ్రీ చదలవాడ ఎచ్చయ్యగారు 'మానవత్వ' మనే ఉన్నతాదర్శానికి రూపకల్పన చేస్తున్నారు బహుభాషలలో బహు విషయాలలో ప్రవేశమేకాక, ప్రావీణ్యం సంపాదించిన ఈ కవి మానవ జీవితం తఱచిచూచి నిగ్గుచూపటంలో ఆశ్చర్యంలేదు

'ఇదేనా విముక్తి?', 'నాకూ హక్కు ఉంది!' అనే రెండునాటికల సంపుటి ఇది ఈ రెండునాటికలలో ప్రబోధమూ ఒక్కటికావడమే ఈ సంపుటీకరణంలోని ఔచిత్యం

తన్ను కంటిని రెప్పలాకాపాడే అప్పనూ అమ్మనూ కాదని వారి బారినుండి విముక్తిపొందాలని, స్థిరమైన అజ్ఞానమూ అస్థిరమైన ఆవేశమూ గల ఒక అస్వతంత్రుణ్ని ఏకాకినీ కట్టుకొని నట్టేటిలోనిల్పిన అనాథ ఆర్తనాదమే 'ఇదేనా విముక్తి?' అన్న ప్రశ్న

అభమూ, శుభమూ ఎరుగని ప్రేమ తాటాకులమంటలా లేస్తే ఆమె భవిష్యత్తుమగూర్చిన విచారంతప్ప అన్యంఎరుగని మంగమ్మ (అమ్మ) చుక్కమ్మ (తల్లి)ల ఆవేశ ఆజ్యధారకాగా, అన్నసహాయంతో రాగమ్మ లేచిపోయి, 'విముక్తపొందా' ననుకొని సుబ్బయ్యను పెండ్లాడింది తీరా అతడు అన్నా కి బదులు ఆశయాలుచూపి, విడిచిపెట్టి పోవటమేగాక క్రిష్ణమ్మ (నాయకురాలు) అగుపాజ్జల్లో పెట్టినప్పుడు అనుమానాలకూ అవమానాలకూ ఆస్పదమైనప్పుడు దిక్కులేని దీనస్థితిలో, 'ఇదేనా విముక్తి!' అనుకొంటూ అల్లాడే రాగమ్మా, తనబిడ్డ కష్టాలపాలైందని తెలిసీ తెలియడంతోనే కడుపుతీపతో గతం మరచివచ్చి చేరదీసుకొన్న చుక్కమ్మ-పశ్చాత్తాపానికీ, పవిత్ర ప్రేమకూ మూర్తికట్టినట్లు కన్పిస్తారు

ఇక - లేనిపోని కలలన్నీ కని, ఎక్కడా సుఖంకానక, శాంతిలేక, భర్తను త్రోసిరాజని, 'నాకూ హక్కు ఉంది!' అన్న అహంకారంతో

# ప్రవేశిక

ఆంధ్రజాతి జీవితంతో తన జీవితాన్ని పెనచుకొని, ఆంధ్రసాహితీ మహోద్యానంలో తన కవితాలతికలు పెనుచుకొని, ప్రతిభా వ్యుత్పన్నతల ప్రాభవంతో ఈనాడు శ్రీ చదలవాడ ఎచ్చయ్యగారు 'మానవత్వ' మనే ఉన్నతాదర్శానికి రూపకల్పన చేస్తున్నారు బహుభాషలలో బహు విషయాలలో ప్రవేశమే కాక, ప్రావీణ్యం సంపాదించిన ఈ కవి మానవ జీవితం తరచిచూచి నిగ్గుమాపటంలో ఆశ్చర్యంలేదు

'ఇదేనా విముక్తి?', 'నాకూ హక్కు ఉంది!' అనే రెండునాటికల సంపుటి ఇది ఈ రెండునాటికలలో ప్రబోధమూ ఒక్కటికావడమే ఈ సంపుటీకరణంలోని ఔచిత్యం

తన్ను కంటిని రెప్పలా కాపాడే అప్పనూ అమ్మనూ కాదని వారి బారినుండి విముక్తిపొందాలని, స్థిరమైన అజ్ఞానమూ అస్థిరమైన ఆవేశమూ గల ఒక అస్వతంత్రుణ్ని ఏకాకినీ కట్టుకొని నట్టేటిలో విల్చిన అనాథ ఆర్తనాదమే 'ఇదేనా విముక్తి?' అన్న ప్రశ్న

అభమూ, శుభమూ ఎరుగని ప్రేమ తాటాకులమంటలా లేస్తే, ఆవె భవిష్యత్తునుగూర్చిన విచార తప్ప అన్యంఎరుగని మంగమ్మ (అమ్మ) చుక్కమ్మ (తల్లి)ల ఆవేశం ఆజ్యధారకాగా, అన్నసహాయంతో రాగమ్మ లేచిపోయి, 'విముక్తపొందా' ననుకొని సుబ్బయ్యను పెండ్లాడింది తీరా అతడు అన్నానికి బదులు ఆశయాలుచూప విడిచిపెట్టి పోవటమేగాక క్రిష్ణమ్మ (నాయకురాలు) ఆరుపాజ్జల్లో పెట్టినప్పుడు అనుమానాలకూ అవమానాలకూ ఆస్పదమైనప్పుడు దిక్కులేని దీనస్థితిలో, 'ఇదేనా విముక్తి!' అనుకొంటూ అల్లాడే రాగమ్మా, తనబిడ్డ కష్టాలపాలైందని తెలిసీ తెలియడంతోనే కడుపుతీపతో గతం మరచివచ్చి చేరదీసుకొన్న చుక్కమ్మ-పశ్చాత్తాపానికీ, పవిత్రప్రేమకూ మూర్తికట్టినట్టు కన్నిస్తారు

ఇక - లేనిపోని కలలన్నీ కని, ఎక్కడా సుఖంకానక, శాంతిలేక భర్తను త్రోసిరాజని, 'నాకూ హక్కు ఉంది!' అన్న అహంకారంతో

అడుగు బైటికి పెట్టి, ఆ హక్కు కోసం నడువీధిలో అన్వేషించుకోవలసిన అభాగ్యురాలి ఆక్రందనమే 'నాకూ హక్కు ఉంది!' అనే నినాదం

తనకుతాను అంతా న్యాయంగానూ, తానుకాని తక్కిన అంతా అన్యాయంగానూ కన్పిస్తూ, తాను రెచ్చిపోయి, తక్కినవాళ్ళను రెచ్చగొట్టి, 'నాకూహక్కుంది!' అనుకుంటూ, బయటికి గెంటించుకొని తన స్థితి ఎక్కడో ఏమో అప్పటికీ తెలుసుకోలేని దయనీయ స్థితిని ఈ నాటక అతిసహజంగా చిత్రిస్తుంది

ఈ నాటికలు చూస్తూంటే ఒక ప్రపంచం కళ్ళముందు కదు ాడుతుంది మానవుడు స్వబుద్ధితో ఏమిచేస్తున్నాడో, అది ధర్మబాహ్యమైనప్పుడు తత్ఫలితం ఏమవుతున్నదో? మన కుటుంబ సంబంధాలనూ, ప్రేమానురాగాలనూ శాశ్వతంగా నెలకొల్పి సంఘజీవితంలో ప్రశాంతిని ప్రసాదించిన ధర్మానికి కలిగిన ప్రతివిఘాతమూ మన జాతి జీవితంలోనే రూపొందటాన్ని ఈ నాటికలు కళ్ళకు కట్టినట్టు చూపుతాయి ఆవేశపూరితమైన అస్థిరమార్గానికీ మధ్య వున్న వ్యత్యాసాన్ని పాత్రలద్వారా చిత్రించటంలో ఈ కవి కృతకృత్యుడైనాడు

అయితే యిందులో రాగద్వేషాలకు తావులేదు ధర్మేతర ప్రవర్తనా తత్ఫలితాలనూ యథాతథంగా చిత్రించటంద్వారా కవి చేయదలచిన ధర్మప్రబోధం వ్యంజింపబడుతున్నది తప్పుచేసిన వారిని దండించటంకంటె, దారికి తీసుకురావటమే కవి ఆశయం ఎన్నో ఆశలతో ఆదరం కోసం వెతుక్కుంటూ దారితప్పినబాటసారులను ఆదరంతో చేరదీయటమే ఈ నాటికల పరమార్థం

అతి సాధారణంగా నిత్యజీవితంలో అందరం చూచే వస్తువును స్వీకరించి, అందులో ఒక ప్రపంచాన్నే చిత్రించిన ఈ కవి ప్రశంసనీయుడు విదేశీయ భావదాస్యంనుంచి స్వచ్ఛమైన జ్ఞానంవైపు భారతజాతి చేస్తున్న పురోగమన మార్గంలో ఈ నాటికాసంపుటి ఒక వెలుగుదివ్వెటీ అని చెప్పవచ్చు

ప్రయాగ కోదండరామశాస్త్రి

23—4—1956

# ఇదేనా విముక్తి

## ఒకటో రంగం

మంగమ్మ: నా చిట్టితల్లిగా నా కన్నతల్లిగా నిన్నెంత గారాబంగా పెంచాను? నీకీ చదువంతా ఎందుకు చెప్పించాను? నీకేదో మంచి సంబంధం చూసి పెండ్లిచేదామనుకుంటున్నాను ఇంతలో యిలా చేసి కూర్చుంటావనుకున్నానా? ఈ సుబ్బయ్యను ప్రేమించి కూర్చుంటావనుకున్నానా? లేదు నా తల్లి వింటుంది

రాగిమ్మ: అక్కయ్యా! స్వేచ్ఛగా బ్రతకడం మంచిదని నీవే నేర్పావు ప్రేమించి పెండ్లిచేసుకోవడం జీవితానికి పరమధర్మమని నీవే ఉపదేశించావు నీ ఉపదేశాలన్నీ విన్నాను తప్పుకాదుగదా అనుకున్నాను స్వతంత్రంగా స్వేచ్ఛగా మన యింటికి వచ్చేవారందరూ మంచివారనే అనుకున్నాను అందుకే ఇతనితో నాకు పరిచయమైంది చనువు సన్నిహితత్వం నానాటికీ నన్నతనికి చేరువగా చేర్చడానికి కారణమేమోనని పిస్తున్నది నేనేమీ చేయలేకపోయాను అతనంటే

నా కెందుకో యిష్టంగా ఉండేది అతనితో మాట్లా
డుతూ ఉంటే హాయిగానూ, ఆనందంగానూ ఉన్న
ట్లనిపించేది

మంగమ్మ చాలాదూరం పోయావు మంచిగా చెపుతున్నాను
ఇది నీకూ అతనికీ తగదనే మా అందరి అభిప్రాయం

రాగమ్మ అతనికి హృదయం ఇచ్చాను అతన్ని నమ్మిం
చాను మళ్ళీ మనసు మార్చుకోవడం సాధ్యం కాదను
కుంటున్నాను

మంగమ్మ నీకు చిత్తచాంచల్యం కలిగిందా అనిపిస్తోంది కాని
పక్షంలో అతనికీ నీకూ సంభాషణాలు సమాలోచనలు,
ఎందుకంటాను ?

రాగమ్మ నా కేమీ పాలుపోవడం లేదు అతన్ని మరచిపోవ
డం సాధ్యం కాదు

మంగమ్మ నీకోసమే యింత యిదిగా చెపుతున్నాను నీ
సుఖమూ సౌఖ్యమూ నామాట వింటేనే అందుకే
చెప్పేది మరచిపోవాలి నీ మనస్సును నిబ్బరం చేసు
కోవాలి

రాగమ్మ నే నాపని చేయలేను నా మనస్సూ-నా హృదయ
మూ నా స్వాధీనంలో లేవు

మంగమ్మ లేవూ ? మనస్సూ హృదయమూ స్వాధీనంలో
లేవూ ? చేయిస్తాను ఆపనే చేయిస్తాను అంతవరకు
ఎందుకా అని ఆలోచిస్తున్నాను

రాగమ్మ నే నెందుకు మార్చుకోవాలో బోధపడడంలా

మంగమ్మ ఎన్నివిధాల నీ మంచికోసం ప్రయత్నిస్తున్నా అర్థం చేసుకోకుండా ఉన్నావు తెలియడంలా ?

రాగమ్మ తెలిసీ తెలియని స్థితిలో ఉన్నాను అసందిగ్ధంగా అల్లాడిపోతున్నాను నా కెవ్వరూ దిక్కులేరా అని పిస్తుంది

మంగమ్మ నీకు దిక్కులేరూ' దిక్కులేనిదానిగా బ్రతకాలను కుంటున్నావు? జాగ్రత్త! (రాగమ్మ బుగ్గలు రెండూ గట్టిగా మెలివేస్తుంది)

రాగమ్మ అక్కయ్యా! అక్కయ్యా! నీకు నమస్కరిస్తాను నీపాదాలుపట్టుకుంటాను నన్నిలా ఎందుకుహింసిస్తావు?

మంగమ్మ నిన్ను చీల్చేస్తాను అతనికీ నీకూ సంబంధం విడి పోయిందనేవరకూ నిన్నీ నిర్బంధంలోనే ఉంచేస్తాను (గట్టిగా రెండు లెంపలూ వాయిస్తుంది)

రాగమ్మ అయ్యయ్యయ్యయ్యో! చంపేస్తున్నావు అక్కయ్యా! నన్ను చంపేస్తున్నావు (అని పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ ఆయాసపడుతుంది )

మంగమ్మ ఎందుకొచ్చింది ఆయాసం? ఎందుకొచ్చిందీదుఃఖం? ఒక్కమాటలో అంతా తేలిపోతుందే! ఎంతచెప్పినా చెవికి పట్టించుకోకుండా ఉన్నావు

రాగమ్మ చంపండి నన్ను కోసేయండి ఎంతచేసినా అతణ్ణే ప్రేమిస్తానంటాను అతన్నే వివాహంచేసుకుంటాను

మంగమ్మ ఆమాటంటే కెస్తా వాతేస్తాను (రెండు బుగ్గలూ గట్టిగా నులిమివేస్తుంది)

రాగమ్మ అక్కయ్యా! అక్కయ్యా! నా ప్రాణాలు పోతున్నాయి నన్ను హింసిస్తే ఏమీ లాభంలేదు నన్ను ముక్కలు ముక్కలుగా తరిగినా ప్రయోజనంలేదు నా హృదయాన్ని అతనికే అర్పించాను అతనే నా జీవితంగా భావిస్తున్నాను

మంగమ్మ ఎంతచెప్పినా ఏం ప్రయోజనం లేకుండా ఉంది ఓసి బండముండా! ఎంతకు తెగించావే! మా పరువూ ప్రతిష్టా తీసేస్తున్నావు ఛీ ఛీ యిక్కడేపడి చావు నిన్నెవరూ ఆదరించేవాళ్ళు లేరు (రెండు చేతులతో జడపట్టి లాగి ఈడ్చి విసిరేస్తుంది)

రాగమ్మ అమ్మా! అమ్మా! అబ్బా! అబ్బా! (అని నిట్టూరుస్తూ ఏడవలేక ఏడవలేక ఏడుస్తుంది)

మంగమ్మ ఓసి మొండిముండా! ఎంతకూ మార్చుకోవా? చూస్తాను ఎలా మార్చుకోవో చూస్తాను చావు యిక్కడే ఒంటరిగా కృశించి కృశించి చావు (విసురుగా వెళుతుంది)

—(తెర)—

రెండోరంగం

చుక్కమ్మ నా ముద్దులతల్లి నా మాట వింటుంది నా కన్నతల్లి నా మాటలోనే ఉంటుంది ఎవరెన్ని చెప్పినా,

ఎవరెన్ని చేసినా అన్నీ మరచిపోతుంది నా కోసం మారచిపోతుంది అక్కయ్య చెప్పిందే వింటుంది ఏం తల్లీ ? వింటావుగదూ ? నా మాట దక్కిస్తావుగిదూ ?

రాగమ్మ వింటాను నీమాట వినకేంచేస్తాను అక్కయ్య మాట వినక ఎలాబ్రతుకుతాను ? ఒక సారి అందరిమాట వినాలనే అనిపిస్తోంది అంతలో నా మాటే చెల్లించుకోవాలని అనిపిస్తుంది ఏగి ఎలా చెల్లించుకోవాలో తెగని సమస్యగాఉంది

చుక్కమ్మ రెండుమాటలు ఎలా చెల్లించుకుంటావు తల్లీ ? ఒకేమాటమీద ఉండాలి అదిగో అక్కయ్య మాటే వినాలి

రాగమ్మ అందరూ అక్కయ్యమాటే ఎందుకు వినాలి ?

చుక్కమ్మ అక్కయ్య అందరిని పోషిస్తోంది అందరి ముచ్చట ముచ్చటా తీరుస్తోంది పంచప్రాణాలు మీపైనే పెట్టి బ్రతుకుతోంది అక్కయ్య చేసేదంతా మనకోసమేగా ? అందువల్లే వినాలి నీ మనస్సు మార్చుకోవాలి వాడి చేతుల్లో చూస్తూ చూస్తూ నిన్ను పెట్టలేం ! వాడి రాజకీయాలూ వాడూ ఎప్పుడు ఏ ఉపద్రవం తెచ్చుకుంటాడో ఎవ్వరికీ తెలియదు అలాంటివాడి చేతుల్లో అల్లారుముద్దుగా పెంచుకున్న నిన్నెలా పెట్టమంటావు తల్లీ నిన్ను వాడిచేతుల్లో పెట్టలేను కన్న కడుపులో కార్చిచ్చు పెట్టుకోలేను

రాగమ్మ అదా మీ భయం ? అర్థమైంది అంతా అర్థమైంది
చుక్కమ్మ తెలిసిందితల్లి ! అంతా తెలిసిందీ ? అర్థంచేసు కున్నావ్ ?

రాగమ్మ అర్థంచేసుకున్నాను ఆ అభిప్రాయాలనే ప్రేమిం చాను అందుకే వివాహం చేసుకోవాలను కున్నాను

చుక్కమ్మ వద్దుతల్లి వద్దు నీ వలాంటి మొండి నిర్ణయం చేసుకోవద్దు వాడ్ని అర్థరాత్రివేళ ఎవరియిల్లు దోయ డానికి పోతాడో, ఎవరిప్రాణం తీయడానికి పోతాడో ఎవ్వరికీ తెలియదు ఎక్కడో నిన్ను విడిచేస్తాడు ఎవరిచేతుల్లోనో వాడు చనిపోతాడు నీవు దిక్కులేని దానివై పోతావు నీ చిన్నమనస్సులో నీ లేత హృద యంలో ఏ పవిత్రభావాలో నిండివుంటాయి అను భవం చాలనివయస్సు ఆలోచనలేని మనస్సు పశ్చా త్తాపం పొందే పరిస్థితులనే ఆహ్వానిస్తుంది నిన్నూ నీ జీవితాన్ని నీ భవిష్యత్తునీ తలచుకుంటే నా హృద యం కరిగిపోతోంది నా మనస్సు పరితాపంతో తుక తుక ఉడికిపోతోంది అనుభవంతో చెప్తున్నాను

రాగమ్మ అతని ఆశయాలూ అతని అభిప్రాయాలు అందరికీ సుఖం కూరుస్తాయనే విశ్వసిస్తున్నాను అతనిమార్గమే అందరికీ శాంతిసౌఖ్యాలను చేకూరుస్తుందని ఆశిస్తు న్నాను ఆ స్వేచ్ఛలోని ఆనందం ఆ సంచారంలోని

ఉన్నవీ లేనివి కలిపి చెప్పారు వాడితల్లికి నేనంటే ఎంతో పగఉంది నా సంసారం అల్లరిపెట్టడానికే యిదంతా చేయిస్తోంది వాడిమాటల్లో పడిపోయావు నీ కివన్నీ తెలియక పడిపోయావు

రాగమ్మ ఎన్నిచెప్పినా నాకు నచ్చడంలేదు మీ అభిప్రాయాలు నాకు నచ్చడంలేదు

చుక్కమ్మ నచ్చవు నీకు నామాటలు యిప్పుడవి నచ్చవు మాతృ మమతలో నాహృదయం తబ్బిబ్బైపోతోంది ఎన్నివిధాల ప్రయత్నించినా నీ మనస్సు మారకుండా ఉంది

రాగమ్మ అతను చాలామంచివాడు ఎంతో ఆదరంగా చూస్తాడు నేనంటే అంతులేని ఆనందం పొంగివస్తుంది అతన్ని వదులుకోలేను మీరు ఎన్నివిధాల బాధించినా ఎన్ని కష్టాలుపెట్టి నా మనస్సు విరిచేయాలని ప్రయత్నించినా అతనే నా సర్వస్వంగా భావించాలని వస్తోంది నా మంచికీ నా చెడ్డకు, నా సర్వస్వానికీ, నా జన్మకీ కారణమైన నీకు మనస్సు విప్పిచెపుతున్నాను హృదయం అతనికే అంకితమైవుంది అతన్నివిడిచి ఒక్కక్షణం దూరంగావున్న బ్రతుకే దుర్భరంగా కనిపిస్తోంది

చుక్కమ్మ ఇంతవరకూ కొంచెం జాలి, దయా, మమత మాతృత్వం నన్ను పట్టి ఏడించాయి ఇప్పుడు నేనూ

స్థిరనిర్ణయం చేసుకున్నాను అతనికి నీకూ నా ప్రాణం ఉండగా పెండ్లి జరగనివ్వను

రాగమ్మ అతన్నే పెండ్లిచేసుకుంటాను

చుక్కమ్మ ఎలాచేసుకుంటావో చూస్తాను చేసుకోవే! చేసుకో (రెండుచెవులూ గట్టిగా సాగదీస్తుంది)

రాగమ్మ అక్కయ్యవంతు అయిపోయింది ఇది నీవంతా? నన్నిలా హింసిస్తున్నారే? ఇదేనా న్యాయం? ఇదేనా ధర్మం? అబ్బబ్బబ్బా! అయ్యయ్యయ్యో, నా ప్రాణం పోతూంది

చుక్కమ్మ చస్తే ఎడ వదిలిపోతుంది చావకుండా బ్రతికి సాధిస్తున్నావు ( రెండుచెవులూ గట్టిగా నులిమి వేస్తుంది )

రాగమ్మ ఎంత హింసించినా అతన్నే ప్రేమిస్తాను ప్రేమించాను పెండ్లిచేసుకుంటాను

చుక్కమ్మ ఓసి భడవాముండా! ఎంత మొండిదానివైపోయావే! అబ్బబ్బబ్బా! నా చేతులే నొప్పిగా ఉన్నాయ్ (మంగమ్మ, సుబ్బయ్య వస్తారు)

సుబ్బయ్య రాగమ్మా! ఎందుకలా ఉన్నావు?

రాగమ్మ అనుభవిస్తున్నాను ఆదరించేవా రొక్కరూ లేరు అనురాగం చూపేవా రసలే లేరు

చుక్కమ్మ మా అమ్మాయి ఎలాఉంటే నీ కెందుకు? ఏడు
స్తుంది, మొత్తుకుంటుంది, విచారిస్తుంది, దు ఃఖిస్తుంది
అడగడానికి ఆదరించడానికి నీ వెవరంటాను?
మంగమ్మ రాగమ్మా! అత నెందుకు వచ్చాడో తెలుసా?
రాగమ్మ తెలియదు
మంగమ్మ అతనిమీద నీకు ప్రేమ లేదనిచెప్తే వెళ్ళి
పోతాడు ఆ మాటవిని వెళ్ళాలనే వచ్చాడు
రాగమ్మ తనివితీరా కామించాను కాదు కాదు మనసారా
ప్రేమించాను
సుబ్బయ్య నాకు తెలుసు రాగమ్మ హృదయం నాకు తెలుసు
అందుకనే చెప్పాను రానని చెప్పాను అయినా రమ్మ
న్నారని వచ్చాను విన్నాను చూచాను హింసించ
డం చూచాను నిర్దయులై హింసిస్తున్నారు చూడ
లేను ఈ హింసాకృత్యాన్ని చూడలేను వెళు
తున్నాను (గబగబా వెడతాడు)
మంగమ్మ తెగించావు అన్నింటికీ తెగించావు ప్రేమించానని
ఎంత ధీమాగా చెప్పేస్తున్నావు ప్రేమించు, బాగా
ప్రేమించు (రెండు లెంపలూ వాయిస్తుంది)
రాగమ్మ చంపేస్తున్నారు నా ప్రాణాలు తోడేస్తున్నారు
చస్తున్నాను అబ్బబ్బబ్బా! అమ్మా!
చుక్కమ్మ నా కడుపున చెడబుట్టావు వాడిముందే నన్నవ
మానంచేశావు చావు ఇక్కడే పడిచావు నీవు

నా కడుపున పుట్టలేదనుకుంటాను ఒక ఏడుపు ఏడ్చి అవతల పారేయిస్తాను (రెండుచెవులూ సాగలాగుతుంది)

సోమయ్య (వస్తాడు) అమ్మా అక్కయ్యా! అలా ఎందుకె చంపేస్తున్నారు ఉండండి ఉండండి కొంచెం నిదానించండి

మంగమ్మ నీ అలుసే దాన్నింతవరకూ తెచ్చింది

చుక్కమ్మ అన్నీ నేర్పావు సంసారం అల్లరిపెట్టిస్తున్నావు మిమ్మల్ని కన్నాను అన్నీ అనుభవిస్తున్నాను

సోమయ్య అనండి, నన్ను అనండి, చివాట్లుపెట్టండి, ఇందులో నాలోపం లేదని నే ననడంలేదు

చుక్కమ్మ దీనికెవ్వరూ అన్నంపెట్టకండి ఆ మూల చీకటి గదిలో పారేయండి చస్తుంది నాపీడ వదిలిపోతుంది (రెండుచెవులూ పిండి విసురుగా లోపలికి వెళుతుంది)

మంగమ్మ అదేచేస్తాను దీనిగతి అంతేకావాలి అందరినీ తిరస్కరించింది నీవొక్కడివే దీని కాప్తబంధువట చూస్తాను నీసంగతి దీనిసంగతి పట్టిచూస్తాను ఎవరు ఏవిధంగా రక్షిస్తారో చూస్తాను (అని జడ పట్టి ఈడుస్తూంటుంది)

సోమయ్య నాగమ్మా! అక్కయ్య చెప్పిందే వినరాదూ? వింటే తీరిపోతుందిగా? నీకూ నాకూ ఈ అల్లరిఅంతా ఎందుకు?

రాగమ్మ ఎవరెన్ని చెప్పినా ఎలాజరగవలసింది అలాగే జరుగుతుంది చూస్తున్నావుగా అందరూ పెట్టే హింస కళ్ళారా చూస్తున్నావుగా, చూడండి అందరూ నన్ను నిర్బంధించిచూడండి క్రూరంగా హింసించిచూడండి అప్పుడు నే నతన్నే ప్రేమిస్తాను అతణ్ణే పెళ్ళిచేసుకుంటాను మాటయిచ్చాను

మంగమ్మ వాగుతున్నావు వాగు, వాగు ఎంతవాగినా ఎవ్వరూ వినిపించుకోరు నిన్నెవ్వరూ పట్టించుకోరు పదరా, పోదాంపద ఇక్కడేకూర్చుని దానిలో అదే ఏడ్చుకుంటూంటుంది ఆదరించేవారెవ్వరూ లేక ఏడ్చి ఏడ్చి దానంతటదే చస్తుంది దానిచావదే చస్తుంది మనకెందుకు పోదాంపద (విసురుగా లాగి వదలి వేస్తుంది రాగమ్మ క్రిందపడి గిలగిలా తన్నుకుంటుంది)

సోమయ్య వస్తాను చెల్లీ! వెళ్ళివస్తాను నిస్సహాయంగా విడిచి వెళుతున్నాను

(మంగమ్మ సోమయ్య రెక్కపట్టుకుని లోనికి వెళుతుంది రాగమ్మ వెక్కివెక్కి ఏడుస్తూ విచారంగా చూస్తుంటుంది)

—(తెర)—

మూడోరంగం

పార్టీ కార్యదర్శి రాగమ్మకూ సుబ్బయ్యకూ యీ పూట వివాహం జరుగుతుంది

ఒకసభ్యుడు అన్నిపనులూ పూర్తవుతున్నాయ్
ఇంకోసభ్యుడు కామ్రేడ్ కొండలరావింటికి కబురుచేశాం
మరోసభ్యుడు నిర్బంధంనుంచి తప్పించి కామ్రేడ్ రాగమ్మను తీసుకురావడంలో ఆలస్యమైంది
వేరొకసభ్యుడు ఇద్దరూ అలంకరించుకొంటున్నారు ఇప్పుడే వస్తారు సోమయ్య అన్నిఏర్పాట్లు జేశాడు, కామ్రేడ్ రాగమ్మ విముక్తపొందింది తెలివైనవాడు, చురుకైన వాడు వాకచక్యంకలవాడు యుక్తపరుడు మంచి సంస్కారికాబట్టే సులువుగా మనం మనవిధి నిర్వహించ గలుగుతున్నాం (రాగమ్మ సుబ్బయ్య కృష్ణమ్మ, కొండలరావు వస్తారు అందరి ముఖాలలోనూ ఆనం దోత్సాహం ద్యోతకమౌతుంది అందరు సమతా ధర్మం వర్థిల్లాలి! సమతాధర్మం వర్థిల్లాలి! అని పెద్దగా అంటారు
కార్యదర్శి కామ్రేడ్స్ సుబ్బయ్య రాగమ్మలు యిలా వచ్చి కూర్చోవాలి అంతా నిశ్శబ్దంగా ఎవరెవరి స్థానాల్లో వారు కూర్చుంటే మన కార్యక్రమం సక్రమంగా జరుగుతుంది కూర్చోండి అందరూ నిశ్శబ్దంగా కూర్చోండి (అందరూ కూర్చుంటారు సుబ్బయ్య, రాగమ్మలు వేదికపై కుర్చీలలో కూర్చుంటారు )
కొండలరావు కామ్రేడ్ కార్యదర్శి అధ్యక్షులుగా ఉండి, యీ వివాహవిధులు పూర్తిచేయాలని కోరుతున్నాను

కృష్ణమ్మ నేను బలపరుస్తున్నాను
కార్యదర్శి కామ్రేడ్స్! ఆర్థికంగాను, సాంఘికంగాను వివాహ విధానంలోను, యిది అధునాతన మార్గం జనులందరికీ ప్రయోజనకరంగా ఉంది ఉంటుంది మన పద్ధతిలో మేళతాళాలు మంత్రి తంత్రాలు, సాంప్రదాయాలనే సర్వరీతులూ పూర్తిగా తుడిచి వేశాం అందాలకూ అలంకారాలకూ విలాసాలకూ, సుగంధ ద్రవ్యాలకూ ధనవ్యయంచేసే బూర్జువా పద్ధతికి స్వస్తిచెప్పాం అంతేకాదు బలవంతంగా చేయాలనుకొంటున్న పిల్లల పెళ్ళిళ్ళను మొత్తంమీద అరికట్టటానికీ ప్రయత్నిస్తున్నాం మన ప్రయత్నాలు బుద్ధిపూర్వకంగా బహిరంగంగా అంగీకరించక పోయినా మన ప్రయత్నం మనం చేస్తూనేవున్నాం ఇది నూతన సాంప్రదాయం ఈ సాంప్రదాయాన్ని ఎవరు ఎన్ని విధాల నిందించినా యిదే ఉత్తమమైనదిగా అంగీకరించిన యువకులు, యువతులు బలపరుస్తున్నారు క్రమక్రమంగా యిది సజీవమైన మహోద్యమంగా ప్రబలమౌతుందనడానికి సందేహించ నక్కరలేదు విప్లవం వర్ధిల్లాలి! (అందరూ విప్లవం వర్ధిల్లాలి అంటారు) కామ్రేడ్ సుబ్బయ్యా! ఇదిగో యీ పూలదండ రాగమ్మ మెడలో ఉంచు (సుబ్బయ్య లేచి దండ రాగమ్మ మెడలో వేస్తాడు) కామ్రేడ్ రాగమ్మా

యీ దండ సుబ్బయ్య మెడలో ఉంచు రాగిమ్మ సుబ్బయ్య మెడలో దండ వేస్తుంది ఒక సభ్యుడు అందరికి పూలు పంచుతాడు )

కార్యదర్శి ఇద్దరూ యీ ప్రమాణం చేయండి (ఇద్దరికీ చెరో కాగితం యిస్తాడు)

సుబ్బయ్య సమతాధర్మం వర్ధిల్లడానికి, ఒకరికి ఒకరు తోడుగా ఉండడానికి, సాంఘిక జీవనంలో, స్వతంత్రంగా స్వేచ్ఛగా జీవించడానికి, పార్టీకి అండదండగా ఉంటూ ప్రాణాలు సహితం అర్పించడానికి సిద్ధంగా ఉంటాం ఉజ్వలమైన మానవ భవిష్యత్తుకోసం కృషిచేస్తాం

రాగమ్మ (ఇదే ప్రమాణాన్ని చదువుతుంది) (అందరూ, విప్లవం వర్ధిల్లాలి విప్లవం వర్ధిల్లాలి అంటూ పూలు వధూవరులపై జల్లుతారు)

కార్యదర్శి కామ్రేడ్స్! ఈ నూతన వధూవరులిద్దరూ, సుఖంగా ఆనందంగా, తమపై బడిన ఈ నూతన బాధ్యతలను నెరవేర్చుకొనేశక్తి కలిగించుకోవాలని కోరుతున్నాను మీ తరఫునా, నా తరఫునా విప్లవాశీస్సులందిస్తున్నాను

కృష్ణమ్మ కామ్రేడ్ రాగమ్మ పాడుతుంది చాలా బాగా పాడుతుంది ఈ ఆనందోత్సవంలో అందరి మనస్సులూ రంజింపజేసే పద్ధతిలో పాడుతుంది

కార్యదర్శి కామ్రేడ్ రాగమ్మా! ఏదీ ఆ పాట పాడి విని
పించు అంతా వినాలనే కుతూహలంతో ఉన్నారు

రాగమ్మ ఆ షృతే మనలోని అనుబంధమా యెనూ
విడివడని మన మనసు ఎడబాపలేరురా—
రాగానురాగమే రమణీయరసమయీ
ఎదలోని ప్రీతి - ఏకమై నిలిచెరా—
విజ్ఞానమే మన - దనాస్వరముగా
మధురమై మదిలోని మననమై వెడలెరా
ఆనందమందమై ఆహ్లాదమమరమై
అనుభవము ఆశగా అవతరించాముగా—
ఆశయము అణువుగా ఆదర్శ మవనిగా
అంతటా అన్నింట అంది ఉన్నాముగా—
(విప్లవం వర్ధిల్లాలి అందరూ విప్లవం వర్ధిల్లాలి అంటారు)

కార్యదర్శి వధూవరులు విముక్తి పొందారు స్వేచ్ఛందంగా
స్వేచ్ఛాజీవులై సమాజంలో సంచరిస్తారు పార్టీ సభ్యు
లందరూ అండగా ఉండి ఆదరంగా చూడాలి
కామ్రేడ్స్! ఈ వ్యవహారం యింతటితో పూర్తి
చేస్తున్నాను ఎవరి కార్యక్రమంలో వారు నిమగ్నం
కావాలి వెళ్ళండి పదండి ఎవరెవరి పనులలో వారు
నిమగ్నంకండి (అందరూ పళ్ళెంలోని పూలుతీసి

వధూవరులపై చల్లుతూ "విప్లవం వర్ధిల్లాలి" "విప్ల వం వర్ధిల్లాలి అంటుంటారు )

—తెర—

నాలుగో రంగం

సుబ్బయ్య రాగమ్మా! ఓ రాగమ్మా! అలా చూస్తున్నా వేం? వెళ్ళిపోవాలి త్వరగా వెళ్ళిపోవాలి

రాగమ్మ ఎక్కడికి వెళ్ళడం?

సుబ్బయ్య ప్రభుత్వ నిర్బంధ విధానం నానాటికీ హెచ్చి పోతోంది పార్టీ శాభ్యులందరూ రహస్యంగా వెళ్ళి పోవాలి

రాగమ్మ మీరు కూడా వెళుతున్నారా?

సుబ్బయ్య నన్నే ముందు పొమ్మన్నారు

రాగమ్మ కొంతకాలం సెలవు తీసుకోండి

సుబ్బయ్య సెలవు తీసుకోవడానికి యిది ప్రభుత్వోద్యోగం కాదు మరే కంపెనీ ఉద్యోగమూ కాదు ఇది ప్రజా సేవ అందులో విప్లవ బాధ్యతగల ప్రజాసేవ

రాగమ్మ నాకేమీ తోచడంలేదు ఎన్నో ఆశలు పెట్టుకొని యింతవరకూ బ్రతికాను మావాళ్ళు ఎన్నిహింసలు పెడుతున్నా మీ కోసమే సహించాను అప్పుడే నన్ను ఒంటరిగా విడిచి వెళతామంటున్నారు నన్నేం కమ్మంటారు?

సుబ్బయ్య నేను చాలా నిస్సహాయుణ్ణి పార్టీ అధికార పూర్వకంగా ఆజ్ఞ యిచ్చింది ఈ ఆజ్ఞను ఉల్లంఘిస్తే ఆదర్శాలకూ ఆశయాలకూ విఘాతం కలిగించానని నిందిస్తుంది నేనా నిందావాక్యాలు విని భరించలేను

రాగమ్మ నీ కోసం ఎన్నో నిందలుపడ్డాను నా కోసం కొంచెం త్యాగం చెయ్యలేరా అని అడుగుతున్నాను

సుబ్బయ్య నీ కోసం నా హృదయాన్నే త్యాగంచేశాను నిన్ను విడిచిపోవడం నా కేమాత్రమూ యిష్టంలేదు

రాగమ్మ స్వేచ్ఛా స్వాతంత్ర్యం అనేమాటలు అన్నీ అసత్యాలేనా?

సుబ్బయ్య కావు కావు అందులో అన్ని విషయాలూ సత్యాలే

రాగమ్మ అయితే మనస్సుకు యిష్టంలేకండా ఎందుకు దూరంగా పంపుతున్నారు? నాకూ మీకూ కాకుండా ఎందుకుచేస్తున్నారు? ఇందులో ఏదో మోసం ఉందని వస్తోంది

సుబ్బయ్య ఇది బూర్జువా ప్రభుత్వం ఈ ప్రభుత్వాన్ని సాయుధవిప్లవంతో కూల్చాలి ఈ ప్రయత్నంలో ప్రజావిప్లవం వెల్లువలా ప్రవహింపజేయడానికి రహస్య పోరాటం ఒక్కటేమార్గం

రాగమ్మ నాకంతా అయోమయంగావుంది దిక్కు తోచకుండాఉంది హృదయంలో బెంగబెంగగావుంది

మావాళ్ళ నిర్బంధం తొలగిందిగదా అని సంతోషించానో లేదో అప్పుడే ఏకు గులాంటివార్త మీనుంచి విన్నాను! నా హృదయం దహించుకుపోతూంది అబ్బా! బాధ

సుబ్బయ్య: జీవితంలో ఎడబాటును సహించే గుండెనిబ్బరం లేనందుకు విచారపడుతున్నాను ఇవి మాటలకు సమయంకాదు ఇప్పుడు ఎవరిచేతనైన సహాయం వారిచేతలద్వారా చేసిచూపిస్తేనే విప్లవపోరాటం ఫలిస్తుంది బూర్జువాప్రభుత్వాన్ని కూల్చి సమతా ధర్మం వర్ధిల్లే సోషలిస్టుప్రభుత్వాన్ని స్థాపించుకోవచ్చు ధైర్యము విశ్వాసము కలిగించే దీవెనలిచ్చి నన్ను సుఖంగా తిరిగిరమ్మని పంపిస్తావని ఆశించాను ఝాన్సీ రాణి, రుద్రమదేవి మల్లమాంబ మొదలైన వీరవనితలు నీకు ఆదర్శప్రాయులని భావించాను నా ఆశలన్నీ కూల్చేస్తున్నావు

రాగమ్మ: నేను యోచనలేని పనిచేశాను ఎంత పశ్చాత్తాప పడినా ప్రయోజనంలేదు

సుబ్బయ్య: నిరుత్సాహపడితే నీమనసు దహిస్తుంది దారీ తెన్నూ తోచకుండాపోతుంది ఇది మార్గంకాదు నిన్ను నీవే యీ ఆపత్సమయంలో ఓదార్చుకోవాలి

రాగమ్మ: నన్ను నేనే ఓదార్చుకోవాలి అవునవును స్వయం కృతాపరాధం చేసుకున్నాను అనుభవిస్తున్నాను

నాలో నేనే తెంచి తెంచి కృంగి ప్రశ్నిస్తాను వెళ్ళండి, మీదారిని మీరు స్వేచ్ఛగా వెళ్ళండి మీమార్గానికి నే నడ్డం రావడంలేదు నాకేమన్నా దిక్కుచూపించి వెళ్ళండి

సుబ్బయ్య: పార్టీ కామ్రేడ్స్‌ని ఏమన్నా సహాయంచేయమని అడిగాను పార్టీ సభ్యులనుగాను తమవల్ల కానే కాదన్నారు నా ఆత్మమిత్రులను బంధువులనూ అడిగిచూచాను ఎవ్వరూ ఏవిధంగానూ తోడ్పడలేనందుకు సానుభూతిని మాత్రం చూపించారు హృదయం విప్పచెపుతున్నాను ఇదివాస్తవం ఇంతెందుకు? ఒక్కమాటలో చెప్పేస్తాను అసలీ విప్లవ పోరాట చరిత్రే వ్యక్తిగత సహాయంచేసే విధానాన్ని నిరసిస్తుంది అందువల్ల ఎవ్వరూ ఏవిధమైన వ్యక్తిగత సహాయం యివ్వరు

రామమ్మ: పార్టీలో అందరూ వ్యక్తులేగా? ప్రతిఒక్కరూ తమకు తాము వ్యక్తులమేనని భావిస్తే పార్టీ ప్రాతిపదికే దెబ్బతింటుంది అంతేకాదు వ్యక్తులకు వ్యక్తిగత సహాయం చేయకుండా పార్టీ విప్లవపోరాటాలు నిర్వహిస్తుందంటే నమ్మలేకుండాఉన్నాను ఇలాంటిపార్టీని విప్లవపార్టీ అనడంకంటె అపహాస్యం మరేముంటుంది?

సుబ్బయ్య: ఇంకా నీమనసులో బూర్జువాభావ ప్రవాహం వుందనిపిస్తోంది అందువల్లే నీలో యీ పిరికితనముంది

ఇలాంటి ఎరికిస్వభావంకలవారు విప్లవ పోరాటాన్ని అర్థంచేసుకోలేరు

రాగమ్మ  నే నీ నాడు మీకు ఎరికిదానిఎగా కనిపిస్తున్నాను నిన్నటివరకూ నా అంత సాహసంకల వ్యక్తే మీకు కనుపించలా మీ మాటలన్నీ నా అంతరాంతరాళాలలో ప్రతిధ్వనిస్తున్నాయ్ నాకు కల్పించిన ఆశలూ, భోగాలూ అన్నీ కళ్లముందు తిరిగిపోతున్నాయ్ మరువలేని అనుభవం నా మనస్సులో గిరగిరా తిరిగిపోతోంది

సుబ్బయ్య  విప్లవస్వభావాన్ని ఎప్పటికప్పుడే విలువకడతాం తల్లిగాని తండ్రిగాని, అన్నగాని అక్కగాని, భార్యగాని, బిడ్డగాని మరే ఆప్త బంధుమిత్రులుగాని మా విప్లవపోరాటానికి వ్యతిరేకులైతే యమసదనానికి సీదాగా పంపిస్తాం ఇదే మా విప్లవదీక్షకు పరీక్షగా భావిస్తాం

రాగమ్మ  మానవ సంఘంపై ఈర్ష్యాద్వేషాలు, మీ మనసులో మీ హృదయంలో పెనవేసుకునిపోయి ఆవేశంతో మాట్లాడుతున్నారా అనిపిస్తోంది ఇది మానుషత్వ విధానమో అమానుషత్వ విధానమో తెలియనితనంలో మునిగి తేలుతున్నారనిపిస్తోంది మీ అభిప్రాయాలు మీ వరకే పరిమితమై ఉంటాయ్ మీతోనే నశిస్తాయ్

కృష్ణమ్మ (వస్తుంది) కామ్రేడ్ సుబ్బయ్యా! ప్రయాణానికి సిద్ధంగా ఉన్నావా లేదా? నీ సామాగ్రిఅంతా సర్ది సిద్ధంగా ఉంచాను ఎక్కడ ఏర్పాట్లు అక్కడ పూర్తి చేసి ఉంచాను

సుబ్బయ్య అంతా సర్దుకున్నాను కాని రాగమ్మలో బూర్జువా భావాలు తలెత్తుతున్నయ్ జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూండు

రాగమ్మ నాకు దిక్కులేకుండా చేసిపోతున్నారు నన్ను నట్టేటిలో ముంచిపోతున్నారు ఇది మీకు న్యాయం కాదు

కృష్ణమ్మ స్త్రీ పరాన్న భుక్కులుగా పరితకడం కన్న నైచ్యం లేదన్న విశ్వాసంగల కుటుంబంలో సభ్యురాలుగా ఉన్నావు నిన్ను నీవు తెలుసుకోవాలి నీ బాధ్యత నీవు గమనించి ప్రవర్తించాలి ఇది నీకు అధునాతనంగా కనిపించవచ్చు అయినా తప్పదు

సుబ్బయ్య అన్నీ ముందుముందు ఆవిడే తెలుసుకుంటుంది

రాగమ్మ అన్నీ తెలుసుకున్నాను మా నవజీవితవిధానంలోని మహిమంతా ఇప్పుడే తెలుసుకున్నాను స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సాగరంలో ఏమిటో గమనించాను పగవాళ్లుకూడా పడరాని బాధని గ్రహించాను

సుబ్బయ్య ఇంకా నెమ్మది నెమ్మదిగా తెలుసుకోవలసింది చాలాఉంది మా పోరాట కార్యక్రమంలో ఒక

భాగంలోని ప్రతిపదికే యిప్ప గ్రహించావు
ఇంకా నీకు చాలా నేర్పవలసిఉంది నీకు చెప్పడం
గానే మేము నిమగ్నులమైయుంటే విప్లవపోరాటం
కాస్తా దెబ్బతింటుంది జాతీయ బూర్జువా పరిపాలన
స్థిరపడిపోతుంది తెలిసిందా? రాగమ్మా-చెప్పిందంతా
తెలిసింది కాదు జాగ్రత్తగా జవిస్తు వుండు
వెళ్ళివస్తాను

కృష్ణమ్మ అప్పగింతల్లోనే కాలంకాస్తా గడిచిపోతుంది ఒక్క-
క్షణం ఆలస్యమైతే వార్తాహారులు తప్పిపోతారు

రాగమ్మ ఇప్పటివరకూ మాట్లాడింది మానవస్వభావమా?
యాంత్రికస్వభావమా? అని పోల్చుకోలేకపోయాను
పోల్చుకోగల శక్తిగూడా నాకు లేదనిపిస్తుంది నేనూ
నా జివితం నట్టనడిసముద్రంలో మునిగి తేలుతున్న
నావలాఉన్నాం

సుబ్బయ్య కామ్రేడ్ రాగమ్మా! విప్లవ వందనాలు వెళు
తున్నాను (కృష్ణమ్మదగ్గరగాపోయి చేతులూచేతులూ
కలిపి సైనికులవలె నడుస్తూ వెళుతుంటారు రాగమ్మ
నిస్సహాయంగా చూస్తూ కన్నీరు చీరచెంగుతో
తుడుచుకుంటూ ఉంటుంది)

— తెర —

## ఆయిదో రంగం

కాజయరావు రాగమ్మా అలా విచారపడితే ఎలా? నీవార్తి చేరగానే వచ్చాను జరిగి చేసుకున్నదానికి చింతిస్తే వచ్చే లాభం లేదు

రాగమ్మ నేను తెలిసిచేసుకోలేదు నాకీ దుర్గతి సంభవిస్తుం దనుకోలేదు నాలోని అనురాగమూ ఆవేశమూ ప్రబలం కావటంవల్ల వచ్చిన ఫలితం అనుభ విస్తున్నాను

కాయజ మంగమ్మా చుక్కమ్మా నెత్తీ నోరూ కొట్టుకుని చెప్పినా వినకుండాచేసుకున్నావు వాళ్ళను దుఃఖంలో పెట్టావు నీవు దుఃఖంలో మునిగావు దుఃఖానికి ఆద్యంతాలు కనుపించడంలేదా అనిపిస్తోంది

రాగమ్మ నిన్నటివరకు సన్మానదరించేవారిలా కనిపించారు ఈనాడు దిక్కులేదని విక్కటిల్లుతున్నా ఆదరణ చూపించేవారు లేరు ఎందరెందరినో ప్రాధేయపడి అడిగాను ఒక్కరూ నామాను పట్టించుకోలేదు నా మంచీ చెడ్డా అడిగి తెలుసుకోలేదు ఇప్పు డన్నింటికి మీరే నాకు కనిపిస్తున్నారు నే నెలాజీవించాలో ఎవరిఅండను బ్రతికి బయటపడాలో తెలియనిస్థితిలో ఉన్నాను

కాయజ అమ్మకూ అక్కయ్యకూ కబురు పంపేవచ్చాను

రాగమ్మ నిజంగా వార్త పంపించివచ్చారా! వాళ్లు వస్తారని నే ననుకోవడంలేదు నా కా విశ్వాసంకలగడంలేదు నా బాధ్యత ఎందుకుపట్టించుకుంటారు? పట్టించుకోరు నేను వాళ్ళుచెప్పిన ప్రతిసమస్యనూ తిరస్కారభావం తోనే చూచాను వాళ్ళు చెప్పిందే వింటే ఇప్పటి యీగతి నాకు పట్టేదికాదు

కృష్ణమ్మ (వస్తుంది) ఓహో హో హో! అనుకున్నంతపని చేస్తు న్నావు బూర్జువా ప్రజాస్వామ్యవాదితోనే స్నేహం చేస్తున్నావు ఇతను దేశద్రోహి, ప్రజాద్రోహి, విప్లవ విద్రోహి, ఇతనితోనేనా నే స్తంకడుతున్నది సుబ్బయ్య అననేఅన్నాడు నీబుర్రలో బూర్జువావాసన ప్రారంభ మైందన్నాడు అతనుచెప్పింది అక్షరాలా చూస్తు న్నాను నాకళ్ళతో నేను స్వయంగాచూస్తున్నాను

రాగమ్మ మాస్తావు చూస్తావు ఎన్నెన్నో మాచేవుంటావు నీకు నిజంగా దివ్యదృష్టి ఉంది అయితే నీలో ఒక్కటే కనిపించడంలేదు స్త్రీకి ఉండవలసిన హృదయమే కనిపించడంలేదు నీ హృదయంలోనుంచి ఆ భావన జారిపోయిఉంటుంది అందువల్లే యిలా మాట్లాడు తున్నావు నాయిష్టం నాపైన నీ పెత్తనమేమిటి?

కాయజ అందరిపైనా పెత్తనం చేయడం ఆవిడకలవాటు అంతేకాదు వాళ్ళకూ వీళ్ళకు మధ్య వార్తలుమోయ

డం, తగవులుపెట్టడం తీర్పులుతీర్చే దివ్యమూర్తిలా తయారవటం ఆమె నైజం

కృష్ణమ్మ: ఏమిటి రాగమ్మా! విప్లవ వ్యతిరేక మురాదారు నీతో రహస్య మంతనాలు చేస్తున్నావు! అదేమంటే నీమీద నాకు పెత్తనం లేదంటావు నీ పాపాలు నాపిడికిలిలోనే ఉన్నాయ్ జాగ్రత్త!

రాగమ్మ: నా పాపాలు నా అభిమానాలు అన్నీ నీ అంగట్లోనే పెట్టుకోవాలనుకుంటున్నావు అంతేనంటావా?

కాయజ: ఆవిడతో తగవులాడితే ఎగిరి అమ్మేస్తుంది

కృష్ణమ్మ: మావాను మాట్లాడినాను మీ యిద్దరి మంతనాల ఫలితం తెలియచేసి పోతున్నాను విప్లవ ప్రతీఘాతకులైన మీతో మాట్లాడటం అసలు నాదే తప్పు వెళ్ళుతున్నాను

( వెళ్ళును )

రాగమ్మ: ఎంతతలదిప్పుతూ మాట్లాడుతుందో నేను చూచాను ఇలాంటివారేనా ప్రజావిప్లవకారులు! వీరేనా ప్రజా విప్లవోద్యమ నిర్మాతలు ఇంతకన్నా అవివేకం ఉండనే ఉండదు విప్లవం పేరుతో ఎందరెందరినో వంచించిఉంటారు లక్షణమైన దిక్కులేని దీనత్వంతో ఎక్కడెక్కడో తిరుగుతూంటారు వీళ్లు నిజంగా రాక్షసులు

కాయజ వీళ్ళస్వభావము నీకు తెలియదు నీవయస్సు నీఊహా పోహాలుచాలవు నిత్యమూ వీరు బూర్జువాపాలనఅం టారే దానిఅధినేత నెహ్రూ పరమపూజ్యుడు భారత జాతికి ప్రాణంపోశాడు వర్ణ వర్గ జాతి మతభేదం లేకుండా మనిషినిమనిషి ప్రేమించే సామాజికవిధానం వర్థిల్లాలని అహర్నిశ కృషిచేస్తున్నాడు జాతినాయ కుడు, శాంతిప్రియుడు భారతదేశానికి ప్రధానపాలకుడు అయినందుకు ప్రపంచం యావత్తూ ప్రశంసిస్తోంది అయినా వీళ్ళు మన పూజ్యనాయకుణ్ణి నిందిస్తారు జాతికి స్వాతంత్ర్యాన్ని తెచ్చిన మహామహుని దూషి స్తారు రష్యాదేశపు నాయకుడట! ప్రపంచ విప్ల కారుడట! స్టాలిన్ అనేవాడున్నాడట! ఆతణ్ణి యీ దేశంలో ప్రజలంతా పూజిస్తే ముక్తి పొందుతారట ఇంతకన్నా మనజాతికి అవమానం కళంకం ఉండనే ఉండదు

రాగమ్మ నా కేమేమో బోధించారు ఏవేవో ఆశలు కల్పిం చారు నా మనసుకీ కలిగిన అనుబంధాన్ని, అను రాగాన్ని ప్రేమనీ ఆధారంచేసుకొని నా కేవేవో నచ్చ జెప్పారు నేను నిజమనినమ్మాను అనుభవిస్తున్నాను

(చుక్కమ్మ, మంగమ్మ వస్తారు)

కాయజ అమ్మయ్యా, వచ్చారు నా మాటదక్కించారు

చుక్కమ్మ అయ్యో, రాగమ్మతల్లీ! ఎంతో దిగులుపడిఉంటా

ఎని అక్కయ్యను బ్రతిమాలి తీసుకొచ్చాను పాపిష్టి వాడు నా బిడ్డపాలిట పడ్డాడు నా తల్లికి దిక్కులేని స్థితిని కల్పించిపోయాడు నా కన్నతల్లి ఉసురు వాడికి కొట్టతుంది వాడి పార్టీవాళ్ళకీ కొడుతుంది ఈపాపం ఊరికేపోదు ఈ దుర్మార్గానికి ఫలితం అనుభవిస్తారు

మంగమ్మ చెల్లీ! నిన్నీస్థితిలో చూడవలసి వస్తుందన్న భయంతోనే నిన్నింతగా బాధించాను దయలేకుండా ప్రవర్తించాను నా ముద్దుచెల్లెలికి అన్నిదిక్కులనుండీ కష్టాలే ముంచుకొచ్చాయ్ నేను చూడలేను భరించలేను అబ్బబ్బా! బాధ

రాగమ్మ మీరు రారనే అనుకున్నాను మీరు వస్తారనేఆశే నాలో కలుగలేదు మీ ప్రేమను శంకించాను నాకు నేనే అన్యాయంచేసుకున్నాను నన్ను క్షమించండి నాది స్వార్థంతో కూడుకొన్న ప్రేమ మీది పవిత్రమైనప్రేమ ఆనాడు కన్నూమిన్నూకానకుండా ప్రవర్తించాను అందుకు శిక్ష అనుభవిస్తున్నాను (చుక్కమ్మ, మంగమ్మలకాళ్ళమీదపడి పొంగివచ్చేదు ఖాన్ని ఆపుకోలేక వెక్కివెక్కి ఏడుస్తుంది రాగమ్మ దుఃఖాన్నిచూచి ఆపుకోలేక చుక్కమ్మ మంగమ్మలు భోరు భోరున ఏడుస్తారు కాయజరావు కళ్ళల్లో నీళ్ళు గిరుక్రన తిరిగి ఒక్కొక్కచుక్క చెక్కిళ్ళపై రాలుతుంటుంది)

— తెర —

# నాకూ హక్కు ఉంది

## — పాత్రలు —

- లలిత
- కోమల
- సుజాత
- సోములు
- నాగులు

# నా కూ హ క్కు ఉ ంది

ఒక పో ం ం

లలిత ఈ సిగరెట్లతో కొంపంతా గుల్లచేస్తున్నారు అబ్బబ్బ ఎక్కడచూచినా యీ సిగరెట్ పీకలే! ఎప్పటికప్పుడు తీసివేస్తున్నా మళ్ళీమళ్ళ కుప్పలుకుప్పలుగా పేరుకుంటున్నాయి యిల్లంతా యింత రోతగా చేసేస్తుంటే ఎలా చూస్తూ ఊరుకోమంటారు? ఇదిగో మిమ్మల్నే! ఇలా చూడండ ఇలాఅయితే ఎలాగండీ?

సోములు తగలేస్తాను సిగరెట్లు దొరికినంతవరకు కాల్చి తగలేస్తాను నీతో వేగలేనంతకాలం యిలా సిగరెట్లే కాల్చివేస్తాను ఇది నాయిష్టం నన్ను కదిలించకు

లలిత ఆఁ! అంటే సరిపోతుంది మీరంతా మంచే చేస్తున్నారు పాపం! నాతో వేగలేక చనిపోతున్నారు అవును! ఇదే అందరూ చెప్పుకుంటున్నారు

సోములు ఈ సిగరెట్లు కాల్చడం అంతా నీవల్లేవచ్చింది నీపోరు పడలేకుండా ఉన్నాను

లలిత ఏదన్నా అనవచ్చు ఏమన్నా అనవచ్చు అన్నీ మీకే తగిపోతాయ్

సోములు నా ఉదారతే నాకీ స్థితి తెచ్చింది నిన్నన్న ప్రయోజనంలేదు

లలిత మీరు చాలా ఉదారంగా ఉంటారు అన్నీ యీ కళ్ళ తో నే చూస్తున్నాను ఈ చెవులతో నే వింటున్నాను ఎంత ఉదారంగా ఉంటారు ? అదే అందరూ చెప్పు కుంటున్నారు

సోములు ఆడవాళ్ళకు చదువు యివ్వకూడదన్నా యిచ్చాను అందువల్లే యిలా అనుభవిస్తున్నాను

లలిత మీరు అందరితోనూ తిరిగివస్తారు నే నెవరితో మాట్లాడినా అనుమానంగా చూస్తారు నా కెవరితో పని ఉందన్నా కోపగిస్తారు అదేమంటే కస్సూబుస్సూ మంటారు ఇదేగా మన నిత్యజీవితం ? ఇలా అయితే త్వరలోనే తెల్లవారుతుంది చాల్లెండి ఇంతటితో చాలించండి

సోములు వినిపించకు అబ్బబ్బా, యిక నా కా మాటలు వినిపించకు నీకు నచ్చినట్లే సంచరించు అన్నీ అనుభ విస్తే అప్పుడే అర్థమవుతుంది

లలిత అనవలసినవన్నీ అంటారు నాకు తిక్కఎక్కిస్తారు మీలో మీరు నాలో నేను బాధపడేలా చేసు కుంటారు

సోములు మనలో మనకు పడకుండా ఉంది నన్ను నీవు అర్థంచేసుకోవు నేను నిన్నర్థంచేసుకుందా మనుకున్నా అసాధ్యంగా ఉన్నావు నీ మాటలన్నీ వింటుంటే మనకు కుదరనే కుదరదనిపిస్తుంది

లలిత కోపంలో అనుకునే మాటలన్ని పట్టించుకుంటారు. అంతా చికాకుపడిపోతారు మీతో ఎలా మెలగాలో తెలియకుండా ఉంది అబ్బా! అంతా నా చావుకే వచ్చిందా అనిపిస్తుంది

సోములు ఇందులో నీ కొచ్చిన చావేమీ లేదు అంతా నా చావుకే వచ్చింది ఏంచేస్తాను నాచావు నేనేచస్తాను నిన్నా హాస్టల్‌లో చేర్పించేస్తాను

లలిత నే నలా చేరనే చేరను

సోములు నిన్నంతా పోరుపెట్టావు చదువుకోసం హాస్టలులో చేర్పిస్తేనే శాంతిస్తానన్నావు సరేనని అంగీకరిస్తే కాదంటున్నావు ఎప్పటికి ఏదితోస్తే అదే నీ యిష్టంగా ఎంచమంటావు ఈ పద్ధతి నాకు నచ్చడంలేదు నిన్ను నేను హాస్టలులోనే చేర్పించేస్తాను నాకు నేను సుఖంగా ఉంటాను

లలిత మీకు మీరు సుఖంగా ఉంటారా? అయితే ఏమనా చేసుకోండి ఏమిచేస్తారో చూస్తూంటాను

నాగులు (వస్తాడు) నమస్తే

సోములు, లలిత నమస్తే

సోములు ఇలాకూర్చోండి ఎప్పుడు వచ్చారు?

నాగులు (కూర్చొని) ఇవాళే

లలిత అంతా కులాసాగానే ఉన్నారా?

నాగులు అందరూ కులాసాగానే ఉన్నారు

సోములు  వచ్చానన్న ప్రకారం రావడం ఎప్పడన్నా జరుగుతుందేమోనని చూస్తుంటాను అదే మీకు సాధ్యం కాకుండా ఉంది

నాగులు  ఏంచేయమంటారు తలకు మించిన బాధ్యతలున్నాయ్ ఎంత ప్రయత్నించినా అనుకున్న ప్రకారం రాలేకపోతున్నాను

లలిత  మీరు రాకపోవడం మా స్పర్థ తీరడం యథాప్రకారం కావడం జరుగుతూనే ఉంది

సోములు  ఎన్ని విధాల చర్చించదామనుకున్నా లాభం లేదనిపిస్తోంది

నాగులు  సంసారంలో అలానే అనిపిస్తుంది

లలిత  ఈ బాధ అందరికీ ఉండదు మీలా మావారూ ఉంటే సంసారం ప్రశాంతంగా సాగిపోతుంది

నాగులు  పొరబడుతున్నారు సుజాత చెప్పింది వింటే అంతా భిన్నంగా వింటారు

లలిత  అంతా విన్నాను సుజాత చెప్పిందంతా విన్నాను మీతో ఆమె ఎంత వాదించినా మీరంటే చాలా మెచ్చుకుంటుంది అది మీ ప్రవర్తనలోనే అందరికీ తెలిసిపోతుంది

సోములు  వెళ్ళొస్తాను మాట్లాడుతూ ఉండండి

నాగులు  ఇప్పుడు వెళ్ళడం అంత మంచిది కాదనుకుంటాను

సోములు ఇంతలో ముంచుకు పోయిందేమీ లేదు మీరు మాట్లాడుతూ ఉండగానే వచ్చేస్తాను ఇంతలో యింత కంగారెందుకు?

లలిత వెళ్ళనివ్వండి విశ్రాంతి కోసం వెళుతున్నారు పాపం! వెళ్ళనివ్వండి

నాగులు అయితే వెళ్ళండి మీ యిష్టం

సోములు వెళుతున్నాను ఇప్పుడే వస్తాను (వెళతాడు)

లలిత అబ్బబ్బబ్బా! నా తల పగిలిపోతుంది ఎంత సన్నిహితులైనా దయా దాక్షిణ్యం కలగడం లేదు చదువు సంగతి వస్తూనే కస్సుబుస్సులాడుతారు కఠినంగా మాట్లాడేస్తారు చికాకుతో వెంటవెంటనే సిగరెట్ పై సిగరెట్ కాల్చి వేస్తారు ఏదేదో మనసులో భావించుకుంటారు రుస రుసలాడుతూ చూస్తుంటారు ఇదంతా చూస్తుంటే నాకు అయోమయంగా ఉంది

నాగులు మీరు అర్థం చేసుకోవడంలో పొరబడుతున్నారు మిమ్మల్ని సరదిద్దవలసి ఉంది మీమీద నాను భూమికి ఉంది

లలిత నాకు నమ్మకం కలగడం లేదు ఎంత ఆలోచించినా నా నమ్మకానికి నా రందడం లేదు నేనిక నమ్మకం పెట్టలేదు మీరెన్నన్నా చెప్పండి వింటాను ఈ ఒక్క విషయంలోనూ మన్నించండి

నాగులు అలా అనకండి త్యాగపతి అలా అనకండి మీరావేశంతో అంటున్నారు మీరు మీకే అన్యాయం చేసుకోబోతున్నారు ఇది మీ సంసారానికి క్షేమం కాదు, మీ కుటుంబానికి గౌరవం కలిగించదు

లలిత నన్నెప్పుడూ కష్టపెడుతూనే ఉన్నారు నేనీ కష్టం భరించలేను నన్నందరిలోనూ అనరాని మాటలూ అంటున్నారు చదివి ఉద్యోగంచెయడం స్త్రీకి తగదంటున్నారు తామే సంపాదించాలని ప్రయత్నిస్తున్నారట ఆ సంపాదనతోనే సంసారం గడుపుకోవచ్చునట ఇంతవరకూ చదివిన నాజీవితం ఏంకావాలి? ఈనాలుగు గోడలమధ్య నలిగిపోవలసిందేనంటారా? ఈ యాతన భరించలేను ఈ నరకకూపంలో నా జీవితం నాశనం చేసుకోలేను మీరేమన్నా అనుకోండి

నాగులు ఆవేశంలో అలానే అనిపిస్తుంది

లలిత నాకావేశంలేదు నన్నర్థంచేసుకోండి నేనీ నాడు నాలుగు గోడలమధ్య అంటుగుండలు కడుగుతూ బ్రతుకలేను అది నాకిష్టం లేకపోవడంవల్లనే దురవస్థ పడుతున్నాను

నాగులు అయితే బాధపడకండి తప్పకుండా చదువుకోండి

లలిత అది వారి కిష్టంలేదు

నాగులు చదివిస్తాననే అన్నాడు నాకా విశ్వాసం ఉంది

లలిత ఎవరన్నా అడిగితే సరేనంటారు ఆ తరువాత నా పని పట్టిస్తారు
నాగులు అయితే ఇది సమస్యగానే ఉంది
లలిత ఎన్నెన్నో సహించాను ఎంతెంతో ఆశతో నిరీక్షించాను ఏమాత్రం మార్పు రావడంలేదు అంతా స్వార్థం! పచ్చిస్వార్థం! ఆమాటా ఈమాటా చెప్పి అన్నీ చేయించుకోడానికే మాస్తారు నా గురించి ఒక్కటీ పట్టించుకోరు బయటివారికి కిచేపీ తెలియవు చెప్పుకుంటే పరువుపోతుంది అందువల్లే నాలో నేను కుమిలిపోతున్నాను అయ్యయ్యో బిడ్డ! నా బిడ్డ!! ఒక్కటే బిడ్డ! ఎవ్వరూ పట్టించుకోలెదు చేతుల్లోనే ప్రాణాలు విడిచింది దిక్కులేని చావు చచ్చింది నిలువునా కూలిపోయాను అశాంతి! బాధ నా గుండె తరుక్కుపోతుంది నా హృదయం మండిపోతుంది నా చిట్టితల్లి నా పసితల్లి నా చేతుల్లోనే చంపుకున్నాను ఈ దుఃఖం భరించలేను ఈ బాధలు చూడలేను ఇలా వంటడం తినడంలోనే నా జీవితం తెల్లవార్చుకోలేను ఈ స్థితి భరించలేను సహించలేను అయ్యయ్యయ్యో! (పెద్దగా ఏడుస్తుంది)
నాగులు అలాకుంగిపోకండి జీవితంలో కష్టాలనేవి వస్తూనే వుంటాయి వాటంతట అవి తొలగిపోతూనే ఉంటాయి కొంచెం ఓర్పు వహించండి

లలిత ఈ యమయాతన భరించలేను ఇలా ఏడ్చి నాలో నేను తపించి నీరసించిపోలేను నన్ను నాదారిన బ్రతకనివ్వండి అబ్బాబ్బా! వెళ్ళిపోండి ఇదిగో యిలా చూడండి నాకు సానుభూతి చూపించేవారే లేరు మీరూ వారికేమిత్రులు ఎన్నిచెప్పినా వారికే అను కూలంగా వుంటారు వెళ్ళండి బాబూ వెళ్ళండి

నాగులు దు ఖంలో ఉన్నారు ఏదేదో మాట్లాడుకుంటు న్నారు

లలిత అవును నా దు ఖం తీరేదికాదు వెళ్ళండి నన్ను ఒంటరిగా వుండనివ్వండి

నాగులు మీకు బాధగా ఉందా? అయితే పోయి పరుండండి

లలిత ఇలా అన్నానని ఏమీ అనుకోకండి వెళుతున్నాను

నాగులు నే నేమీ అనుకోను

లలిత ఎూ రెంతో మంచివారు చాలా మంచివారు వారి కివిఏవీ చెప్పకండి మీకు పుణ్యముంటుంది పొర పాటున చెప్పారా నన్నింకా కష్టపెడతారు నాపైన కొంచెం దయ వుంచండి అనుగ్రహం పెట్టండి వెళు తున్నాను (పెద్దగా ఏడుస్తూ లోపలికి వెళుతుంది) (నాగులు విచారంగా చూస్తుంటాడు)

—(తెర )—

వెం పే రం గం

లలిత  కోమలా నీవు నిజంగా అదృష్టవంతురాలవు

కోమల  నా అదృష్టం పగవాళ్ళకూ-డా వద్దు

లలిత  ఎందుకమ్మా అలా అనుకుంటావు? ఎక్కడకు వెళ్ళా లన్నా స్వేచ్ఛఉంది ఎవ్వడు ఏ కోరిక గలిగినా తీరే అవకాశం ఉంది ఇంకా నీ వెందుకు నిన్ను నిందించు కుంటావు?

కోమల  ఎందుకా? ఈ వంటరి జీవితం గడిప గడిపి విసిగి పోతున్నాను ఈ పుస్తకాలు, ఈ పూలు, ఈ అలం కారాలు, ఈ సుగంధ ద్రవ్యాలు నన్ను అహర్నిశలు వేధిస్తున్నాయ్ ఇవే నా ఆరాధనాప్రియంగా మిగిలి వున్నాయ్ నా జీవితమంతా ఒక ఎడారిగా ఉంది అబ్బబ్బ! ఎన్ని వెన్నెలరాత్రిుు ఈ ఎడబాటును సహించ -< హృదయావేదనతో తంవితీరా ఏ<్చవడ్చి నిదురించానో చెప్పలేక పోతున్నాను

లలిత  అయితే రాత్రి నేనూ అదేచేశాన

కోమల  మనం కష్టాలు అనుభవించడానికె జన్మించామా అనిపిస్తున్నది

లలిత  ఈ కష్టాలు అనుభవించలేము అందుకె నేనొక నిశ్చ యానికి వచ్చాను

కోమల  ఏ నిశ్చయం చేసుకున్నా మనకీ జన్మలో మోక్షం లేదనిపిస్తుంది

లలిత ఉంది మోహం ఉంది
కోమల లేదు ముమ్మాటికీ మోహంలేదు
లలిత ఆలోచించాను సుమతి సలహా తీసుకున్నాను
కోమల ఆమె సలహా ప్రికారం మనం చేయలేం
లలిత లోగడ నేనూ అదే అనుకున్నాను కాని యిప్పు
డామె చెప్పిన నిశ్చయానికే వచ్చాను
కోమల ఆ మార్గానికి వేరే ధైర్యంకావాలి
లలిత ఇప్పుడు నా కా ధైర్యంవచ్చింది
కోమల మన ధైర్యాలన్నీ గాలిమూటలే
లలిత కాదు కాదు యీసారి తెంపుచేసుకున్నాను
కోమల అన్నీ చూస్తాను ఎంతవరకీ తెంపు ఉంటుందో
చూస్తాను
లలిత చదువు పూర్తిచేయాలి వుద్యోగం చూచుకోవాలి
స్వయంగా సంపాదించాలి సుఖంగా జీవించాలి
కోమల మాటలు చాల తీయగాఉన్నయ్
లలిత నామాటలు చులకనగా తీసుకుంటున్నావు నాకు పట్టు
దల రానేరాదు వచ్చిందా సాధించేతీరుతాను
కోమల కొత్త కొత్త మాటలు వింటున్నాను ఏదో నీలో
వింతమార్పు చూస్తున్నాను ఏదో చేసేసేలా కని
పిస్తున్నావు
లలిత చెయ్యాలనే నిశ్చయంచేసుకున్నాను సుమతి చక్కటి
సలహా చెప్పింది

కోమల అవునవును ఏమిసలహా చెప్పిందో నాకూ తెలుసు
లలిత నీకెలా తెలిసింది ?
కోమల నేనూ తోవక వెళ్ళాను అప్పుడే వచ్చి వెళ్ళావని చెప్పింది చాలా దుఃఖంలో ఉన్నావనికూడా విచారం చూపింది
లలిత తరువాత !
కోమల చదువుకోడానికి సలహా యిచ్చానంది
లలిత కాదు నిజం చెప్పడంలా ? నీవు నిజంచెప్పడంలా
కోమల కాలేజిహాస్టలులోచేరి పొమ్మన్నానని చెప్పింది
లలిత ఇంతేనా ?
కోమల తనచేతనైన సహాయం చేస్తానని వాగ్దానం చేశానని కూడా అన్నది
లలిత సుమతి చాలామంచిది ఎందరెందరికో సహాయం చేస్తుంది
కోమల అందరివల్లా నిందలూ పడుతుంది
లలిత ఎవరో కొందరు నిందించినా ఆ మెహృదయంమంచిది ఆదరిస్తుంది ఆప్యాయంగా చూస్తుంది హృదయానికి దగ్గరగా తీసుకుంటుంది అనురాగంతో ఆప్తంగా పలకరిస్తుంది అక్కడ ఉన్నంతవరకూ తల్లిఒడిలోని తన్మయత్వమే జ్ఞాపకమొస్తుంది
కోమల కాదు, కాదు కష్టాలూ, సుఖాలూ సమంగా అనుభవించింది చిక్కులూ, చికాకులూ చిన్నతనంలోనే

చవిచూచింది లోతైన హృదయం అనుభవం నిండిన మనస్సుకరిగి ఎవరికి ఎప్పుడు ఎలాచెప్పాలో గ్రహించే నేర్పుఉంది

లలిత అందరికష్టాలూ ఆమె హృదయంలో అందరూ్యాతమై ఉన్నాయి

కోమల లేదు లేదు స్వయంగాపడిన కష్టానుభవమే ఉంది

లలిత ఆమె సంపన్నురాలు కష్టపడే అవుసరం లేనేలేదు

కోమల సంపన్నులూ కష్టాలనుభవిస్తారు

లలిత నేను నమ్మలేను

కోమల నీకు నమ్మకంకలుగదు కాని ఆమె నీ నాలాంటివారి నెందరినో పరిశీలించింది జీవితాలు తరచి చూచింది సంసారంలోని సారాన్ని మనసారా అనుభవించింది మాటలు నేర్చింది మానవుల మతి విరిచేస్తుంది

లలిత అనకూడని మాటలంటున్నావు అర్ధరహితమైన వాదన చేస్తున్నావు

కోమల నాది అర్ధరహితమైన వాదనకాదు అందరినీ ఎదిరించి కాలేజీ హాస్టలులో చేరమనే సలహా అర్ధరహితమైంది నీకు నచ్చినా నచ్చకపోయినా స్నేహధర్మంలో నిజం చెప్పాను

లలిత ఆమె సలహా మంచిది కాదంటావా?

కోమల ఎదురుతిరిగితే వచ్చేది శాశ్వతంగా ఎడబాటేగా?

లలిత ఎడబాటైనా సహిస్తాను చదవాలి నేను నలుగురి లోను తలెత్తితిరగాలి మా బావగారు చదివించారు ఆమె ఇప్పుడు ఉద్యోగంచేస్తోంది నేనూ చదివాను ఏ ఉద్యోగంచేయటానికి పనికిరాని చదువుచదివాను ఆమె ఉద్యోగంచేస్తూ అందరిలో ఆదరణ పొందు తూంది నేను దిక్కులేనిచావు చస్తున్నాను నా అనే వాళ్ళు లేరు నన్ను పట్టించుకునేవాళ్లులేరు ఈ అవ మానంభరించలేను (లేచి కోమలను కౌగలించుకొని ఆవురుమని ఏడుస్తుంది )

కోమల (తల నిమురుతూ బుజ్జగిస్తూంటుంది )

—(తెర)—

మూ డో రం గం

నాగులు ఆమె మనస్సులో కుంగిపోతోంది ఎలాగైనా ఓదార్చాలి

సోములు ఎంతో ప్రయత్నించాను ఏమీ ప్రయోజనం లేకుండా వుంది

నాగులు చదువుకోవాలనే పట్టుదల బలంగాఉంది

సోములు చాలు యిప్పటికి చదివించిచాలు ఇంకా చదివితే ఈ వున్న మతికాస్తా పోతుంది

నాగులు చదివితే రాణించే లక్షణాలేఉన్నాయ్

సోములు అల్పమైన విషయాలలో అంతులేని సంతోషం పొందుతుంది ఇప్పుడు యీమాట ఆమె చెవినిబడిందా ఒక్కగంటలో ఉప్పొంగిపోతుంది

నాగులు అంత ఆనందించేలాఅయితే చదివించడమేఉత్తమం

సోములు ఏమి చదివించమంటావు? ఒక్క క్షణం చదువుతా నంటుంది మరోక్షణంలో యీ చదువు నాకు నాగనే సాగదంటుంది అంతగా చదవాలంటే నేను కాదనే వాడినో కానో నీకు తెలియదూ? మతిస్థిమితంలేకుండా ఉంటుంది అందువల్లే ఆలోచిస్తున్నాను

నాగులు పాపం! బిడ్డను తలుచుకుంటుంది మాతృవాత్సల్యం పొంగి తనలో తానే దుఃఖిస్తుంది అదే ఈ అస్థిమి తానికి కారణం అయిఉంటుందను కుంటాను

సోములు బిడ్డపోయిందేఅనుకో ఐనా యిప్పటకప్పే చాలా కాలం గడచిపోయింది షుమారు రెండు మూడే ళ్ళయిందనుకుంటాను ఇంకా అదేపనిగా ఏడుస్తుం టుంది ఈ బాధ చూడలేకుండా ఉన్నాను ఏమి చేయడానికి పాలుపోకుండా ఉంది ఆమె బంధువు లందరూవచ్చి ఓదార్చిపోయారు మిత్రులందరూ బ్రతిమాలిపోయారు ఎవరెన్ని చెప్పినా మరచిపోలే కుండా ఉంది

నాగులు ఆమె మరచిపోవడానికి మార్గం ఉంది ఆదరంతో చెప్పే నేర్పు చదువుపై మనస్సు పెట్టించే తీర్పు చెప్పు

కలిగితే సంసారం శాంతంగా, సుఖంగా గడచి పోతుంది అంతే, అంతకన్నా మరోమార్గం లేదు

లలిత (విసురుగావస్తుంది) కమ్మగా కబుర్లు చెప్పుకుంటున్నారు బహు బాగా కాలక్షేపం చేస్తున్నారు వంటవిషయం ఆలోచించకుండా దర్జాగా కూర్చున్నారు మహా రాజులు! ఎప్పుడో పెట్టిపుట్టారు యిప్పుడు యిలా కూర్చొని అనుభవిస్తున్నారు

నాగులు కుంపటిముట్టించడం, అన్నంవుడకడం అయిపోయింది ఏదో కొంచెంకూరవండేస్తే ఈపూటకు గడచిపోతుంది వెళ్ళవచ్చులే, యిలారండి అలాకూర్చోండి,

సోములు తోచనివాళ్ళకు తిరగడంఅలవాటు తోచేవాళ్ళకు కబుర్లుకొట్టడం అలవాటు

లలిత కబుర్లు కాలక్షేపాలు కాలాన్ని తినేస్తున్నాయ్ ఇప్పటి వరకూ నేనూ యిదే లోకంగా భావించాను ఇక యీ లోకంవద్దనే వద్దనిపిస్తుంది కూర్చోలేను ఈ కూస్త ప్రపంచంలో మూసాలతరబడి కూర్చోలేను ఈ సువిశాల ప్రపంచంలో సుఖంగా, అందరితో హాయిగా, ఆనందంగా కాలం గడపాలని నిశ్చయించు కున్నాను

సోములు చిత్తం,చిత్తం గొప్పనిర్ణయం అలాచేస్తే ఎవ్వరూ ఎన్నడూ కాదనరు ఇలాంటి నిర్ణయంకోసమే ఎదురు చూస్తూ కూర్చున్నాను

లలిత ఎగతాళిచేస్తున్నారు చేయండి మీరేమి చేసినా పట్టించుకోవాలను కోవడంలేదు

సోములు మరీమంచిది

లలిత మీకెం కబుర్లలో పెట్టేనారు వంటపని అలానేఉంది వెళుతున్నాను వెళ్ళానని కోపగించుకోకండి (వెళుతుంది)

నాగులు ఏదో మనస్సులో పెట్టుకునేఉంది

సోములు వింటుంది కొంప నిలువునా మునిగిపోతుంది నెమ్మదిగా మాట్లాడు

నాగులు ఏదో దిగులుగా ఉన్నట్లుంది విచారంగా కనిపిస్తుంది ముఖం వాడిపోయిఉంది

సోములు ఈ స్థితిలో నిత్యమూ చూసిచూసీ విసిగిపోతున్నాను

లలిత (తెరలోపాట)

పసిపాపవలె మనము పాపమే ఎరుగదు
పసికట్టి కసితీర బాధపెట్టకురా—
మతిలోని నా మమత గతిని గనలేదురా
ఘనమైన మనః ప్రేమ కధను చెఱపకురా—
లాలించి పాలించి లయములో నన్నుంచి
హృదిలోని మధువునే పదిలపరచుమురా—
అనునయము మనలోని ఆర్ద్రమై పోయెనా
అంతరంగము పొంగి అనుబంధమాయెనురా—

పూవులో తావిలా పాదరింటితీగెలా
వ్యాస్తమయ్యేరీతి వ్యవహరించాలిరా—

నాగులు మనస్సు విప్పి పాడింది హృదయం కరిగించిపాడింది
ఎంతో హాయిగాపాడింది

సోములు ఏదో మార్పువచ్చింది ఈ మధ్య ఎన్నడూ పాడ
మన్నా పాడేదికాదు ఇవాళ ఏదో వింతమార్పే
వచ్చింది ఎందువల్లో చక్కనిపాటే పాడింది బహు
కమ్మగా పాడింది

నాగులు అయితే యీ పాట ఎక్కడ నేర్చుకున్నదో ?

సోములు అప్పుడప్పుడు ఏదో నోటితో గొణుగుతుండేది
ఇవాళ బహిరంగంగా పాట పాడింది ఎక్కడ
నేర్చిందో ఏమో చెప్పలేకుండా ఉన్నాను

నాగులు ఈ మధ్యనే స్వయంగా వ్రాస్తూ ఉన్నానని అన్న
ట్లుగా జ్ఞాపకం వస్తూంది

సోములు అలానే అనిపిస్తుంది

నాగులు అడుగేస్తాను

సోములు లలితా ! లలితా !

లలిత (వస్తుంది) ఎందుకు పిలిచారు ?

నాగులు ఆపాట ఎక్కడ నేర్చుకున్నారో చెప్పరూ ?

లలిత స్వయంగానే రాశాను నేర్చుకున్నాను అందుకే
యిప్పుడు పాడాను మీరు వినాలనే పాడాను

సోములు ఓహోహోహాహో! ఇంకేం, కవయిత్రివికూడా అయిపోయావు! సభలకు పోవడం సన్మానాలు చేయించుకోవడం నా కళ్ళారా మూస్తాను నా చెవులారా వింటాను అహో! మహాభాగ్యంగా భావిస్తాను

లలిత ఏంచేస్తారు మీ వాళ్ళు శాంతి నికేతనంలో చదివించినా సంస్కారం అబ్బకుండా చేసుకున్నారు విచారించ కేంచేస్తారు? విచారిస్తారు ఫలితం శూన్యంగా విచారిస్తారు

సోములు ఏమిటి? అప్పుడే నిందించటంవరకూ వచ్చావు! ఎంత నిర్భయంగా మాట్లాడుతున్నావు! కానీ ఆ కాస్తపనీ పూర్తికానీ విచ్చిలవిడిగా తిరగడానికి పీలు కలిగిందిగా విడాకులచట్టం సిద్ధంగానే ఉంది

లలిత చదువుకున్నాను అన్నీ అర్థంచేసుకున్నాను గ్రహించవలసిందంతా గ్రహించాను కాలంకోసం నిరీక్షిస్తున్నాను అనండి మీ మనస్సుకు నచ్చినట్లుగా అనండి ఇప్పుడే వెళ్ళిపోయేలా అనండి

నాగులు క్షమించండి వెళుతున్నాను మీలో మీరు చాలా చాలావరకు పోతున్నారు మధ్యలో వుండడం మంచిది కాదనుకుంటాను వెళ్ళివస్తాను (వెళ్తాడు)

సోములు మంచి చెడ్డా లేకుండా మాట్లాడేస్తున్నావు మిత్రుడున్నాడనే జ్ఞానంలేకుండా ప్రవర్తించావు బుద్ధిలేదు వివేకంలేదు ఎందుకు యీ బ్రతుకు? ఛీ! పో, పో

లలిత  వింటున్నాను మీ రంటున్నవన్నీ వింటున్నాను బుద్ధి వివేకము జ్ఞానము అన్నీ ఉన్నాయ్ మీ ఆదరణే కొరతగావుంది అందువల్లే యిలా ఉన్నాను అయినా మీకు జాలి కలగడంలేదు

సోములు  ఆదరించాలి నీలాంటివాళ్ళనే ఆదరించాలి చాలు చాల్లే ఇంతవరకు ఉన్న యీ సంబంధం చాలు ఇప్పటికే తలకుమించిన బరువైంది ఇంకా చూపక చూపక నీకె ఆదరం చూపించాలి ! ఇప్పటికి చూపించిన ఆదరం చాలు బుద్ధివచ్చింది రెండు లెంపలూ వాయించుకుంటున్నాను

లలిత  అంతేనా? ఆ తరువాత విషయంకూడా వినిపించండి అదికూడా వినాలని కుతూహలంగా ఉన్నాను

సోములు  వినిపించదగినంతవరకు వినిపించాను ఇంకేం వినిపించను నేను వినిపించడం నీవు వినడం యింకా జరగాలనే అంటావు స్వేచ్ఛాజీవివి నీత్రోవ నీది నాత్రోవ నాది నీకూ నాకూ ఉన్న బంధం ఇంకా ఉందనే అంటావు సిగ్గులేదూ? లజ్జలేదూ? అభిమానం ఉందన్న విశ్వాసం నీపై నాకుండాలా ?

లలిత  ఆగండి, ఆగండి ఇంతటితో మీ ప్రవర్తన ఆపండి నా ప్రవర్తన మీకు అనవసరం నా జీవనం గురించి మీ రడగడం అంతకన్నా అనవసరం

సోములు ఏం? అలా గద్దిస్తున్నావ్? అన్నింటికీ తెగించావు తెగించినవాళ్ళ తీరే చూపిస్తున్నావు
లలిత మీరే తెగించారు
సోములు హద్దుమీరిపోతున్నావు
లలిత హద్దులు ఎప్పుడో దాటిపోయారు
సోములు ఏమిటి, అంటున్నావు? చావగొట్టేస్తాను నోరెత్తితే చావగొట్టేస్తాను జాగ్రత!
లలిత చేతకానివాళ్ళంటే అలానే చేయించుకుంటారు
సోములు ఛీ, ఛీ, పో వెళ్ళిపో ఇక్కడ ఒక్క నిమిషం ఉండడానికి వీల్లేదు
లలిత వెళ్తితే మీరే విచారిస్తారు
సోములు నావిచారంతో నీకు సంబంధంలేదు పో వెళ్ళిపో, వెళ్ళమంటున్నానుగా! అలా చూస్తావేం! వెళతావా? వెళ్ళవా?
లలిత వెళ్ళను ముమ్మాటికీ వెళ్ళను వెళ్ళకపోతే ఏం చేస్తారు?
సోములు మెడబట్టి గెంటేస్తాను
లలిత ఏదీ, గెంటివేయండి
సోములు మరియాదగా వెళ్ళిపో
లలిత వెళ్ళను వెళ్ళను, వెళ్ళను
సోములు చేయిచేసుకోమంటావా?
లలిత మరియాదగా ప్రవర్తించడం నేర్చుకోండి

సోములు వెళ్తావా వెళ్ళవా ?
లలిత వెళ్ళను వెళ్ళనంటే వెళ్ళను
సోములు బలవంతంగా పంపించమంటావా ?
లలిత మీ చేతనైనపని చేయండి
సోములు బలవంతంగానే పంపిస్తాను స్వయంగానే మెడపట్టి నెట్టేస్తాను అంతపనీ చేయించుకుంటావా ?
లలిత మీ కేది మంచిదిగా తోస్తే అలాచేయండి
సోములు మంచిగా వెళ్ళిపొమ్మంటున్నాను
లలిత వెళ్ళిపోలేనన్నానుగా
సోములు వెళ్ళిపోవా ? ఎలా వెళ్ళిపోవో చూస్తాను (లలితను మెడబట్టి బయటకు గెంటుతాడు) ఇదే నీకుతగినశాస్తి ఇప్పుడ కన్నా తెలిసిందా ! నాకింకా కోపం తెప్పించకు వెళ్ళు
లలిత నన్నన్యాయం చేస్తున్నారు ధర్మంతప్పి దండిస్తున్నారు మీకు నా ఉసురు తగులుతుంది
సోములు దయాలేదు ధర్మంలేదు నీతిలేదు న్యాయంలేదు మనకూ మనకూ సంబంధం లేదనే చెప్పాను ఒక్క క్షణంకూడా యిక్కడ ఆగకుండా వెళ్ళిపోవాలి ఇదే చివరిమాట
లలిత ఇంత అన్యాయం చేస్తారా ?
సోములు ఇందులో నేనుచేసిన అన్యాయంలేదు

నా కూ హ క్కు ఉ ం ది

లలిత అగ్నిసాక్షిగా అర్ధాంగిగా అంగీకరించారు ఇప్పుడు ఏదో కోపంలో వెళ్ళిపొమ్మంటున్నారు

సోములు అవును వెళ్ళిపొమ్మంటున్నాను

లలిత ఇప్పుడు ఎక్కడికి వెళ్ళమంటారు దిక్కులేనిదాన్నిగా ఎక్కడ బ్రతకమంటారు? సంస్కారం సంస్కారం అని నా బ్రతుకింతవరకూ తెచ్చారు ఇంకా యీ సంస్కారం మీకు చాలలేదనిపిస్తుంది

సోములు ఎక్కడికి వెళ్ళడానికి తోచకపోతే గంగలో దూకు నాకు రవంత పూచీలేదు ACC NO

లలిత నీ హృదయం పాషాణమైపోయింది 11,223

సోములు అందువల్లనే వెళ్ళిపొమ్మంటున్నాను

లలిత వెళ్ళను ఇక్కడేఉంటాను నాకూ హక్కుంది

సోములు లేదు ఇక్కడ నీకా హక్కులేదు

లలిత ఉంది నీ అర్ధాంగిగా ఉన్నంతవరకు నాకా హక్కు ఉంది నీవెంత గొంతుచించుకున్నా నాకూ హకుంది

సోములు పొమ్మన్నా యిక్కడే హక్కుందంటున్నావు ఉంది నీకూ యిక్కడ ఉండేహక్కుంది నాకూ నీకు బుద్ధి చెప్పే హక్కుంది అనుభవించు ఇదిగో ఇదే శిక్షిస్తున్నాను (లలితను బయటకునెట్టి తలుపులు గడియవేస్తాడు లలత పెద్దగా ఏడుస్తుంది)

894 8132 — తెర —

PIC 6-0-19